సంపుటి – 3 సంచిక – 5, 6.
VOLUME ISSUE

ఆంధ్ర మహిళ

10. జాతీయ భాష, జాతీయ సైనిక శిక్షణ — సుభద్ర

11. గ్రామ సేవ ద్వారా ఉద్యమ వ్యాప్తి — శ్రీమతి ఇ. కోకవమ్మ

12. స్వయం పోషక మయిన పరిశ్రమల ద్వారా విజ్ఞానం. 27 — శ్రీమతి సుభద్ర

13. పిల్లల పాత్రల 38-45.

1వ అరగంట — శ్రీమతి కె. సరళా దేవి, కె. కమలాంబ

2వ అరగంట — శ్రీమతి ఆర్. సామ్రాజ్యం.

2వ అరగంట — శ్రీమతి పి. వెంకట రమణా దేవి

3వ అరగంట — శ్రీమతి ఇ. కోకవమ్మ

14. పల్లెటూరి సంబంధం — శ్రీ కొడవటిగంటి కుటుంబ రావు. 45-47.




సంపుటి 3 | ఆగస్టు 1946 | సంచికలు 5, 6

# ఆంధ్రులం మనం

క్రిందటి నెల 28-వ తేదీన ఆంధ్ర దేశమంతటా ఆంధ్రదినోత్సవం జరిగింది. మద్రాసులో గూడా తెలుగువారు సభ చేసి ఆంధ్ర రాష్ట్రం సాధించి తీరాలని దీక్ష తీసుకున్నారు. నూతన రాజ్యాంగ విధానమును రచించుటకు అవకాశము లేర్పడిన యీ సమయములో మన రాష్ట్ర వాంఛను తిరిగి ఉద్ఘాటించి ఆ ఆదర్శ ప్రాప్తికి వలయు వుత్సాహమును సమకూర్చుకొనుటలో ఆశ్చర్యము లేదు. కాని—

ఏ ఉద్యమమైనా ఫలించాలంటే వుత్సాహముతోపాటు ప్రజలలో కార్య దీక్షవుండాలి. ఆంధ్ర రాష్ట్రం కావాలనే నినాదాన్ని మినహాయిస్తే మన ఉద్యమంలో మిగిలినది యింకేమీ కనబడటం లేదు. ఆంధ్ర మహాసభ ఏటేటా తీర్మానించే విషయములను పరిశీలిస్తే ఒక నిశితమైన కార్యక్రమం, దానిని విజయవంతంగా నడిపించుటకు బాధ్యతవహించే నాయకత్వం గోచరం కాదు. ఎంతకాలం. యీ రెండూ లోపించి వుంటాయో అంతవరకూ మనకు ప్రత్యేక రాష్ట్రమునకు అర్హత చేకూరదు.

కాంగ్రెస్ జాతీయ సంస్థగా శక్తిని సంపాదించుకుని బ్రిటిషు సామ్రాజ్యాన్ని ధిక్కరించ గలుగుతోంది. తాను ఆచరణలో సాధించిన కార్యక్రమము యొక్క విశిష్టతపైననే కాంగ్రెస్ శక్తి ఆధారపడివుంది. స్వరాజ్యం కావాలనే ఆందోళనతోబాటు జాతికి జీవం పోసి ఐక్యతను చేకూర్చే నిర్మాణ కార్యక్రమం అములులో పెట్టి ఆదర్శప్రాప్తికి అర్హతను సంపాదించుకుంది. ఆంధ్ర రాష్ట్ర సంపాదన కోసం ప్రారంభింపబడ్డ ఆంధ్ర మహాసభ, రాష్ట్రవాంఛను పదేపదే వెలిబుచ్చు నాయకులూ ప్రజల వుత్సాహమును సద్వినియోగపరిచి తెలుగు జాతికి గౌరవము, శక్తిని చేకూర్చే కార్యక్రమమును అమలులో పెట్టలేక పోయారు. ఆంధ్రులం మనం!

ఆంధ్ర జాతికి ప్రాణప్రతిష్ట చేసిన మహాపురుషుడు నాగేశ్వరరావు పంతులుగారు. ఆయనకు ఋణపడి వున్నానన్న సంగతే యీ జాతి మనస్సుకు తట్టదు. మనకు దినపత్రికలు వున్నా, చిటికలో లక్షలు ప్రోగుచేయు సామర్థ్యముగల

నాయకులు వున్నా పంతులుగారి దివ్యస్మృతి చిహ్నమును నెలకొల్ప లేకపోయాం ఆంధ్రులం మనం!

మనకు ప్రత్యేక విశ్వ విద్యాలయంవుంది. కాని సుమారు సగం తెలుగు జిల్లాలకు యీ విశ్వ విద్యాలయంతో ఎంత మాత్రం ప్రసక్తి లేదు. విడిపోయిన జాతికి ఐక్యతను సాధించే కార్యక్రమం తలపెట్టని ఆంధ్రులం మనం!

మనకు ప్రత్యేకంగా ఇంగ్లీషు దినపత్రిక లేదని ఎన్నాళ్లనుంచో మొరపెట్టుకుంటున్నాము. కేవలం భగవదనుగ్రహంవలన ఒకటి కాక రెండింటికి అనుమతి వచ్చి యేడాది కావచ్చింది. కాని ఆ రెండింటిలో ఒకటి లక్షలు సమకూడు తేనేకాని బయటకు రానంటుంది. రెండవది పూర్తిగా ఆంధ్రుల చేతులలోనే వుండే భాగ్యానికి నోచుకోలేక పోతోంది, ఆంధ్ర నాయకుల సంపూర్ణ సహాకారం లేకపోవడంవల్ల.

చెన్నపట్నంలోని తెలుగు వారి పిల్లలకు తెలుగు చదువుకునే హక్కు లేదు. జార్జిటౌను లోని తెలుగువారు ఎప్పుడో తెలుగు మరచి పోయి అరవలలో జమ అయిపోయారు. మిగతా వారు కూడా అపంథానే తొక్కవలసి వస్తోంది.

వార్షికోత్సవాలు చేసి ఆంధ్ర రాష్ట్రం కావాలని తీర్మానించడం తప్ప ఆంధ్ర మహాసభకు కార్యక్రమం లేదని రుజువు పరచే విషయాలలో కొన్ని పైన వుదహరించాము. అయినా, మనకు రాష్ట్రం తప్పకుండా సిద్ధిస్తుంది, మన ప్రయోజకత్వం శూన్యమయినా కూడా. భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతాన్ని కాంగ్రెసు ఆమోదించింది; దానిని అమలు పెట్టడానికి ఏ కాంగ్రెసు నాయకుడూ వెనుదీయడు. ఆంధ్ర రాష్ట్ర సమస్య భారతదేశ భవిష్యత్తుపై ఆధారపడివుంది కనుక దానితోపాటే మనకూ శుభ ఘడియలు ఆసన్న మౌతున్నాయని ఆశించవచ్చు.



## స్త్రీలు - రాజకీయములు

"లోక వ్యవహారములలో స్త్రీలు పూర్తిగ పాల్గొని రాజకీయములను చక్కదిద్దుటకు సమకట్టకపోతే మన నాగరికత సుస్థిరం కానేరదు. ఆరువందల సభ్యులుగల పార్లమెంటులో నలభై మంది స్త్రీలు మాత్రము వున్నారు, ఇది యెంత హాస్యాస్పదం! ప్రతీ శాసన సభలోనూ సగానికి సగం స్త్రీలు వుంటేనే కాని ప్రభుత్వాధికారం ప్రజాసేవకు వినియోగపడదు. నేను వృద్ధుడనై పోయాను; స్త్రీల హక్కులకోసం పోరాడడానికి శక్తి చాలదు. గాంధీ యువకుడు; పోరాటాన్ని సాగించి మహిళా లోకానికి విజయం సాధించగలడు.... ఈ ఆదర్శ ప్రాప్తికి ముఖ్యమైన సూత్రం ఒకటి వుంది; ఎన్నికలలో పాల్గొనే ప్రతీ పౌరుడూ తన వోటును ఒక పురుషునకు ఒక స్త్రీకి సమానంగా యివ్వకపోతే ఆ వోటు రద్దయేటట్లు నిర్ణయిస్తేనే శీఘ్రంగా పరిస్థితులు చక్కబడతాయి."

— బెర్నార్డ్ షా.

# బిడ్డలు — ఆటలు



రచన : శ్రీమతి అద్దంకి సుందరమ్మగారు




మానవ జీవితంలో ప్రతిక్షణానికి అపారమైన విలువ వున్నది. కాబట్టి ఈ రహస్యం ప్రతి తల్లి గ్రహించి తన బిడ్డల యొక్క అమూల్యమైన కాలాన్ని సద్వినియోగం చేయడానికి పూనుకున్నట్లయితే, మనం నూతన శిశు విద్యా విధానంలో ఒక శతాబ్దం ముందుకు నడచిన వారం కాగలము.

సద్వినియోగం చెయ్యడం అంటే ఏమిటి? ఎలాగ చెయ్యడం అన్నది మన ప్రశ్న. పిల్లల ఆటే వారి కాలము యొక్క సద్వినియోగం. ఆట ఏదో పుబుసు పోక కల్పించుకున్న పనికిమాలిన వ్యాపకం కాదు. ఆట వారి జ్ఞానోపార్జనకు, వారి గుప్త శక్తుల నన్నిటిని వికసింప చేయడానికి సాధనం. చంద్రగుప్త సార్వభౌముడు పసి బాలుడుగా వున్నప్పుడు మట్టితో రథాలు, గుర్రాలు చేసి మహా యుద్ధములు చేయుచున్నట్లు ఆటలాడేవాడనిన్నీ, ఆతని ఆటలను బట్టియే అతడు గొప్ప యోధుడు కాగలడని ప్రజలు అనుకునే వారనిన్నీ వింటున్నాము. అంటే పిల్లల ఆట వారి భావి జీవితఛాయల్ని స్ఫురింప చేయగలదన్న మాట. అట్టి ఆట ఎల్లప్పుడూ క్రమ బద్ధంగాను, శిక్షా పూర్వకంగాను వుండునట్లు ఏర్పాటు చేయడం తల్లి విధి. అంటే ఈ ఆట బిడ్డల వయస్సుకున్ను, వారి శారీరక, మానసిక వికాసాలకున్ను అనుగుణ్యమైనదిగా వుండవలె. అట్టి క్రమమైన పద్ధతిలో లేని ఆటే అల్లరిగా పరిణమిస్తుంది. ఈ అల్లరి తరుచు తల్లులకు చాలా విసుగు కలిగిస్తుంది. ముఖ్యంగా వంటపెట్టు, ఇతర ఇంటిపనులు వున్న తల్లులు ఈ విషయంలో చాలా బాధపడుతారు. కనుక అట్లాంటి తల్లులందరు కొంత ఆలోచనతో, తమ బిడ్డలకు తగిన ఆటలు కల్పించ పూనుకున్నట్లయితే బిడ్డలకు తల్లులకు గూడా ఎంతో నలిగిడె తగ్గుతుంది.

సాధారణంగా మన పిల్లలు బడిలోకి వెళ్ళడం ౬వ ఏట గాని ప్రారంభించరు. అంతకు లోబడిన వయస్సులోని పిల్లలకు తగిన బడి సౌకర్యాలు మనకు లేవు. ఎక్కడో ఒకటి అర వుంటే అవి మన లెక్కలోకి రావు; కనుక ప్రతి ఇంటిలోను ఈ వయస్సు బిడ్డలకు తగిన ఆట సౌకర్యాలు కల్పించడం చాలా ముఖ్యావసరం. తల్లి బిడ్డలయొక్క ఆహారం ఎంత మెలకువతో సమకూర్చుతుందో, ఆదే విధంగా ఆటల సౌకర్యాలుగూడా సమకూర్చడం ఆమె విధి. దీనికి గాను మనం పెద్ద మొత్తాలు ఖర్చు పెట్టవలసిన అవసరంగాని, ఎక్కువ శరీర కష్టం పడవలసిన అవసరంగాని, ఏమీ లేదు. మన బిడ్డల మనస్సును ఏలాటి ఆటలు ఆకర్షిస్తాయో, ఏ

ఏరకమైన ఆటలు వాండ్లు కోరుతారో చక్కగా పరిశీలించి ఆ యా వయస్సుకు తగిన ఆటలు కల్పించితే చాలు.

వుదాహరణకు చూడండి. రెండు సంవత్సరాలలోపు పిల్లలు ఒక చోట నిలవకుండా చాలా చికాకు పడుతూ వుంటారు. కంటికి బరువుగా కనపించిన ప్రతి వస్తువు ఎత్తడానికి ప్రయత్నిస్తారు. ఎందువల్ల? ఆ వయస్సు బిడ్డలు తమ శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుని తమకు అవసరమైనట్లు వుపయోగించుకునే నేర్పు సంపాదించుకోవడంలో గడుపుతారు. కనుక ఆ సమయంలో వాటికి కాళ్ళు, చేతులు, వుపయోగించుకోడానికి, తగిన నేర్పు, శక్తి ఇచ్చే ఆటలు వుండాలి. ఒక చోట కూర్చుని ఆడుకునే ఆటసామాన్లు ఎన్ని వున్నా వారిని ఆకర్షించవు. కనుక వారికి ఈ వయస్సులో కావలసింది విశాలమైన స్థలము. తరువాత, కొన్ని పెద్ద కఱ్ఱ దిమ్మలు, చక్రాలమీద నడిచే కొయ్యబండ్లు, జంతువులు మొదలైనవి. కఱ్ఱ దిమ్మలు బహుసులభంగా దొరుకుతాయి. ఖర్చుకూడా చాలా స్వల్పం. కొయ్యబండి కొననే అక్కరలేదు. ఏదైనా ఒక జాతికాయ పెట్టెకు చక్రాలు పెట్టి, రంగువూస్తే పని చక్కగా నడుస్తుంది. ఆ బండిలో ఇంట్లోను, తోటలోనూ వుండే చింపి కాగితం ముక్కలు, ఎండాకులు, రాళ్లు అన్నీ ఏరివేసుకొని పోయి దూరంగా ఒక మూల పారపోస్తూ దినమంతా గడపగలరు పిల్లలు. బండిలాగుతూ నడవడమే గాకుండా, ఇల్లు శుభ్రంగా వుంచడం కూడా అలవాటవుతుంది. శ్రీమంతులైన తల్లిదండ్రులు పిల్లల వ్యాయామానికిగాను తయారు చేయబడ్డ నిచ్చెనలు మొదలైన వెన్నైనా కొనుక్కోవచ్చు. కాని మనం ఆలోచించేది సాధారణ కుటుంబీకుల సంగతి. కనుక స్వల్ప ఖర్చుతో తయారయే వాటిని గురించే ఆలోచిద్దాం.

రెండు సంవత్సరాలు దాటి నాలుగు ఏండ్ల లోపుగా వున్న పిల్లలు ఎక్కువ నీటితోను, బంకమన్నుతోను ఆడ గోరుతుంటారు. ప్రతి తల్లికూడా ఎంత మాత్రం ప్రయాస లేకుండా ఒక గంపలోనో, ఒక కొయ్య పెట్టెలోనో కొంత బంకమన్ను పెట్టి, ఇంట్లో కడగడానికి వీలయిన మూలగా చూచి పెట్ట గలదు. ఈ వయసు బిడ్డలు ఏదో వక పని కల్పించుకొని అదే ధ్యాసంగా కూర్చోడానికి మొదలు పెట్టుకూవుంటారు. కనుక వారికి కూర్చుని ఏక దృష్టిగా చేసే పనులు, ఆడే ఆటలు నచ్చుతాయి. అట్టి పనులు మనం ఎన్నో కల్పించగలం. వుదాహరణ బంకమన్ను. దాంతో బొమ్మలు, గురుగులు చేసుకుంటూ గంటల కొద్ది కాలం గడుపుతారు. ఇంట్లో తల్లి చేసే పనులన్నీ చెయ్యాలని వారి పెద్ద కోరిక. కనుక చిట్టిచిట్టి పనులు చెప్పి వారు తన కెంతో సహాయం చేస్తున్నట్లు తల్లి నటించినట్లయితే వారి కెంతో తృప్తిగా వుంటుంది. ఈ వయస్సులో రంగులలోను, రూపాలలోను భేదం కనిపెట్టడం వారికి చాలా ఇష్టంగా వుంటుంది. కనుక ఇంటికి తెచ్చిన కూరలన్నీ కలబోసి, అన్ని వేరు వేరుగా ఏర్పరచి పెట్టమనిగాని, నాలుగైదు రకముల ఆకులు కోసి వాటిని ఏర్పరచమనిగాని ఇచ్చినట్లయితే రూపాలు, రంగుల భేదం కనిపెట్టడమే కాక, ఆ ఆ కాయలలో రంగులు, పేర్లు నేర్చుకోడానికికూడా సహాయకారిగా వుంటుంది. రెండోది పూసలు గ్రుచ్చడం. సాధారణంగా గాజుపూసలు, కొంచం పెద్దవిగా తీసికొని ఒకవూది, దారం ఇస్తే ఎంత పొద్దయినా గ్రుచ్చగలుగుతారు పిల్లలు. పూసలు లేకపోతే రేకలు రాలిపోని పువ్వులు ఇవ్వవచ్చు.

4—5 ఏండ్ల మధ్య వయస్సులోవున్న పిల్లలు తమ చేతి వేళ్ళతో చేసే పనులు కోరుతారు. ఆ వయస్సు బిడ్డలకు ముఖ్యంగా ఇవ్వవలసినది వ్రాత పరికరాలు. కాగితం, రంగు పెన్సిళ్ళు, పలకలు, సీమసున్నపు కడ్డీలు మొదలైనవి వారిని చాలా ఆకర్షిస్తాయి. పాత పుస్తకాలు కత్తెర ఇచ్చినట్లయితే బొమ్మలు కత్తిరించడంలో వారు ఎంతో నిపుణత చూపెట్ట గలరు. ఈ వయసు బిడ్డలకు కొన్ని నూలు అల్లికలు, కుట్టు పనులు సులభంగా నేర్పవచ్చు. పూసలతోను, గాజుగొట్టాల తోను తోరణాలు చక్కగా కట్టగలరు.

ఇవన్నీ గాక, అన్నిటి కంటె ముఖ్యమైంది పిల్లలు తమ పని తాము చేసుకోగలగడం. అన్ని పనుల్లోనూ తల్లి వెన కాలేవుండి సహాయం కావలసి వచ్చినప్పుడు చేస్తూవున్నా గాని, బిడ్డకు మాత్రం తన పని తానే చేసుకోగలనన్న ధైర్యం కల్పించాలి. బిడ్డ భావంలో తన పని తానే చేసుకుంటున్నానన్న తృప్తి వుండినట్లయితే వారి భావిజీవితానికి ఎంతో సహాయకారిగా వుండగలదు.

ఇంకో విషయం. ప్రతి బిడ్డకూగూడా యింట్లో నియమబద్ధంగా చేసే పనులు (Duties) కొన్ని తప్పక వుండాలి. అప్పుడే బిడ్డకు తనుగూడా ఇంట్లో వకవ్యక్తి అనీ తన పని తాను చేయక పోయినట్లయితే ఇంట్లో అందరికి ఇబ్బంది కల్గుతుంది కనక తప్పక చేయవలెననీ ఒక భావం ఏర్పడుతుంది. అల్లాంటి జవాబు దారీగల బిడ్డలు ఇంటికి అలంకారమనుకోవచ్చు.

ఈ సదుపాయాలన్నీ గూడా, ప్రతీ సామాన్య కుటుంబాలలోను సమకూర్చుకోగలం. ప్రతి తల్లి ముఖ్యంగా గమనించ వలసిన విషయం— బిడ్డ సాధ్యమైనంత వరకు స్వతంత్రంగా నిర్భయంగా తన పని తను గడుపుకోగలగడం. రెండవది— కొన్ని కట్టు దిట్టాలకు లోబడి అన్ని పనులు క్రమబద్ధంగా చేసుకోగలగడం. ఇదే ముఖ్యమైన తర్ఫీదు.

ఇంకో చిన్న విషయం. పిల్లలు సాధారణంగా వూహించి ఆడే ఆటలు చాలా ఆడుతారు. ఆ వూహాలతో వారు మనస్సులోని కోరికలన్ని తీర్చుకుంటారు. బొమ్మరిల్లు, పాపాయి ఆటలాడే టప్పుడు, పిల్లలు ఎంత చక్కగా నటించగలరో చూడండి.

ఆ ఆటలో వారి కోరికలు, వారి భయాలు, కోపాలు అన్నిటిని శాంతపరుచుకోదగిన సదు పాయం కలుగుతుంది. కనుక ఈ ఆటలకు చాలా ప్రాధాన్య మిచ్చి, వాటికి కావలసిన పరికరాలన్నీ సమకూర్చడం అవసరం.

ఈ వయస్సులో నాటకాలు, బొమ్మరిల్లు మొదలైనవి తరుచు ఆడడం వల్ల ఇంకో వుపయోగం కూడా వుంది. 4 లేక $4\frac{1}{2}$ సంవత్సరం వరకు పిల్లలు వంటరిగా ఆడుకోడానికి ఎక్కువ ఇష్టపడతారు. ఎప్పుడో కొద్దిగా ఇంకో పిల్లతో కలిపి ఆడుకున్నాగాని అది తృప్తికరంగా వుండదు. వంటెత్తుగుణం, అన్నీ తనకే కావలెనన్న పట్టుదల చాలా ధృడం గావుండడం మూలాన ఇంకొకరితో సర్దుకో లేరు. ఈ పైచెప్పిన ఆటలలో తప్పని సరిగా కలిసి మెలసి ఆడుకోడం అలవాటవుతుంది. ఈ ఆటలలో పిల్లలు తరుచు తమ ఆట సామాన్లు పోగొట్టుకుంటారు. అయినా గాని తల్లులు, వారిని ఆటంక పరచక ఈ ఆటల్లోకి వారిని వుత్సాహపరిచి పంపడం చాలా ముఖ్యం.

ఈ విధంగా తల్లులందరు తమ తమ వీలుకున్న ఆర్థిక పరిస్థితులకున్ను తగినట్లు తమ బిడ్డలకు తగిన తర్ఫీదు యిచ్చినట్లయితే, మన దేశంలో చిన్న బిడ్డలకు తగిన బడి సౌకర్యాలు లేని కొరత చాలా భాగం తీరగలదు.







## ★ ప్రజాపరిషత్తుకు మన ప్రతినిధులు ★



శ్రీమతి దుర్గాబాయి



శ్రీమతి అమ్ము స్వామినాథన్




బెర్చ్‌టెస్‌గాడెన్ గుహాలో హిట్లర్ ఏకాంత గృహం. లోపల ఒక్కటే పెద్ద దీపం వెలుగుతూ ఉంటుంది. గుండ్రని బల్లచుట్టూ అయిదారు చిన్న సోఫాలూ, ఒక్క పెద్ద సోఫా అమర్చున్నాయి. బల్లమీద వరల్డ్‌మేప్ పరిచుంది. నాజీ మిలిటరీ దుస్తులతో, స్వస్తిక్ భుజకీర్తులతో, ఒకసారి మేప్ వైపు, ఒకసారి ఊర్ధ్వ ముఖంగానూ చూస్తూ, అశాంతితో, దీర్ఘాలోచనపరుడై హిట్లర్ పచారు చేస్తున్నాడు. మూసిన ఇనప తలుపులలోంచికూడా విమాన ఝుంకారము, బాంబుల ఛాంకారమూ చొచ్చుకొని వినిపిస్తూనే ఉన్నాయి. అతనికి ఆవులింతలు వస్తున్నాయి.

హిట్లర్ :—(తనలో) కార్యభారం తలపై నున్నప్పుడు ఇలా నిద్రరావడం దుర్లక్షణం. అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా నా సైనికులు ప్రాణాలర్పిస్తూంటే, ఆ మహా వీరుల నియంతనని చెప్పుకుంటూన్న నాకు నిద్రా? నిద్రపోను.

(కొంత సేపు పచారు చేసి) ఉత్తమార్యోక్తి రక్తం ప్రవహిస్తూన్న నార్డిక్ జాతి వరించిన నియంతనై యెన్నడూ ఓటమెరుగని నేను ఈసారి మాత్రం ఓడి పోతానా?

(ధైర్యంతో నవ్వుతూ) ఓ! నా కింక ధైర్యమే. నా దేశమెన్నడూ దాస్యం చేయదు. (ఆవులిస్తూ) ఒకక్షణం ఈ ధైర్యంతోనే హాయిగా నిద్రపోతా.

హిట్లర్ సోఫామీద వ్రాలి గుర్రుపట్టి నిద్ర పోతూంటాడు. కొంత సేపటి కతని కొక కల వస్తుంది. కలలో హిరణ్యకశిపుడు ప్రత్యక్షమవుతాడు. అరడుగుల ఆజానుబాహువు, పెద్ద జుట్టు మెలికలు తిరిగిన మీసాలూ ఉన్నాయి. విభూతిరేఖలపైన పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకున్నాడు. బిళ్ల గోచీతో, ఎర్ర పంచ కట్టుకొన్నాడు. అనాచ్ఛాదమైన దేహంపైని వజ్రఖచితమైన భుజకీర్తులు, చెవులకి చారెడేసి ఉంగ్రాల లోలకులు, వజ్ర కిరీటమూ ధరించాడు. మొలలో పొడవైన కత్తి, చేతిలో గదా ఉన్నాయి.

హిర :—(గుబురైన కను బొమ్మలెత్తి, వికసిత వదనంతో హిట్లర్ వైపు వస్తూంటాడు)

హిట్లర్ :—ఎవరు నువ్వు? ఏమిటా వాలకం! రెడ్డిండియన్‌వా? నీగ్రోవా? హిందూదేశపు భిల్లనాయకుడవా? నా దేశంలో కెలావచ్చావు? నా దగ్గర కెలా వచ్చావు?

హిర :—(అట్టహాసంతో) వెర్రివాడా! నన్నెరగనివాడవు ఈ ప్రపంచకంలో నువ్వొక్కడవు కనుపించావు. ఎవరినై ఉంటానో బాగా ఊహించుకో.

హిట్లర్ :—(ఆశ్చర్యంతో) అంత ప్రసిద్ధి కెక్కినవాడవా? ఎవరవు చెప్మా! (ఆలోచించి) నేను సంస్కృత పురాణాలు చదివి నప్పుడు నీ ఆకారానికి సరిపోయే రాక్షసుల వర్ణనలు చాలా తటస్థించాయి. అంతేగాని, ఈ కాలంలో నీలాంటి ఆకారం గలవా రుండేరను కుంటాను, ఏ కొండ జాతుల్లోనో తప్ప.

హిర :—ఆఁ! కొంత దారిలోకి వస్తూన్నావు. అయితే, చూడు. భాగవతమనే సంస్కృత గ్రంథం చదివావా?

ఊహా చిత్రం ★ శ్రీ వి. వి. యల్. ప్రభాకర్

హిట్ల :—ఆ. మా బెర్లిన్ యూనివర్సిటీ సంస్కృత పండితుడు దాన్ని జర్మన్ భాషలోకి తర్జుమా చేశాడు కూడాను.

హిర :—ఓహో! భూలోకమంతా జయించి, ఘోర తపస్సు చేసి, ఈశ్వరుడివల్ల వరాలుపొంది, దేవతల నోడించి, దేవేంద్రుణ్ణే తరిమివేసి, పరమేశ్వరుణ్ణే పదభ్రష్టుడుగా చేయబూనుకున్న మానవ జాతికి ప్రథమ నియంత నెరుగుదువా?

హిట్ల :—ప్రథమ నియంతా? నేనే కాదూ? (ఆలోచించి) ఆహాఁ! తెలిసింది. రావణాసురుడు కాదూ?

హిర :—ఛీ! ఛీ! వాడా, పది తలల జంతువు! ఒక కోతి చేత తాపులు తిన్న రకం!

హిట్ల :—హిరణ్యకశి—

హిర :—(హిట్లర్ భుజం తట్టి) ఆఁ, ఆఁ.

హిట్ల :—(ఆనందంతో) ఓం హిరణ్యకశిపాయ నమః!

హిర :—హెయిల్, హిట్లర్!

హిట్ల :—సోదరా! ఇలా వచ్చావేఁ?

హిర :—ఈ యుగపు నియంతలలో నువ్వగ్రేసరుడవని, నన్ను మించిన నియంత లేయుగంలోనూ లేరు కనుక, నా అనుభవాన్ని బట్టి నీకు కొన్ని సలహా లివ్వాలని వచ్చాను.

హిట్ల :—నీ అవ్యాజవాత్సల్యానికి కృతజ్ఞుణ్ణి. కాని నీ కెంత నమ్మకమో, నన్ను మించిన నియంత లేయుగంలోనూ లేరని నాకూ అంత నమ్మకమే.

హిర :—నా కన్న నువ్వేవిధంగా గొప్పవాడివో తగిన రుజువు లివ్వగలవా?

హిట్ల :—రుజువు కేముంది? ప్రతీ ప్రాణికీ తెలుసును. హిట్లరు పేరు చెప్పితే చాలు, దేశ దేశాలవారూ గడగడలాడుతారు. చేంబర్లిన్ అంతటివాడు నా యెదట పడేటప్పటికి తోకముడిచాడు. ఫ్రెంచి పితామహుడు, మార్షల్ పెటైన్ ఫ్రాన్సు దేశాన్నే నాకు ధారపోశాడు. డెన్మార్కు—లాంటి ఉపగ్రహాలు సరేసరి. నేను హూంకరిస్తే, వశమైపోయాయి. నేను కనుసైగ చేస్తే చాలు, యుద్ధంలో దూకుదామని నా భక్తుడు ఫ్రాంకో సిద్ధంగా ఉన్నాడు. అమెరికా ఖండపు దేశాలన్నీ ఏకమైనా లెక్క చెయ్యక, నా పేరు చెప్పుకొని అర్జంటీనా నాజీ పద్ధతుల్ని అనుకరిస్తూంది. జపాను నా ఆసరా చూచుకునే యుద్ధంలోకి దిగింది. ఇంత పలుకుబడే నియంతకుంది?

హిర :—నన్ను గురించి పూర్తిగా తెలుసుకుంటే, నువ్వంత గర్వపడవు. ఇంతకీ నీ పలుకుబడీ, విజయాలూ, ఈ భౌతిక ప్రపంచకంలోనే. మరి నేనో, నీ లాగకొన్ని రాజ్యాలు కాక, ప్రంచమంతా జయించాను. అంతటితో తృప్తిపడక మానవ మాత్రుల కగోచరమై, అభేద్యమైన స్వర్గ రాజ్యాన్నే ముట్టడించాను. దేవేంద్రుణ్ణి ముప్పుతిప్పలా పెట్టి మూడు చెరువులు నీళ్లు తాగించాను. అతని రంభను చెరపట్టాను. ఋషులు నా కిచ్చిన శాపాలు బూడిదలో పోసిన పన్నీరయాయి. వరప్రసాదంవల్ల నాకు మృత్యువులేదని నిరాశతో దేవతలందరూ శ్రీమహావిష్ణువుకి మొక్కితే, నాతో ప్రత్యక్షంగా యుద్ధం చెయ్యలేక, ఆ గతిలేని దైవము అవతారం మార్చి దొంగ పోటున నన్ను ముగించవలసివచ్చింది. విధినే గడగడలాడించిన నియంతని, నాతో నీకు సాటా?

హిట్ల :—(చిన్నబుచ్చుకొని) నిజమే కాని, యెంత నియంతవైతే నేం లాభం, ఎన్ని వరాలుంటే నేం? మృత్యువు నెదుర్కో లేక పోయాకే, దేనికి?

హిర :—నేను చెప్పబోయేదీ అదే. అలాంటి నేనే మృత్యువుని జయించ లేనప్పుడు నీ వంటి వారికి దినదిన గండమే.

హిట్ల :—నాకా గండము? కారడవిలో, పర్వతాల మధ్య ఈ గుహుంది. ఒక చిన్న ద్వారంలోంచి, అడుగుదశ సరి ఇనప రేకుల ఎలక్ట్రిక్ లిఫ్టుమీద ఫర్లాంగు కొండ లోపలికి దిగాక, అభేద్యమైన ద్వారముంటుంది. అది తెరిచి లోపలికి వెడితే, నాగదుంటుంది. ఈ గుహ నాకూ, నా అనుచరులకీ తప్ప, ఇతరుల కగోచరం. ఈ గదిలో కే బాంబూ చొచ్చుకు రాలేదు గదా? ఒక వేళ ఎవరైనా నా ఉనికి పసిగట్టాలన్నా, ఈ కొండలో ఉన్న భూగర్భాశ్రయంల్లోంచి వందలకొద్ది విమానాలూ

టాంకులూ, మందుగుండు సామానులూ, కొన్ని వేల సేనలూ నా సింహద్వారాని కహోరాత్రులు పారా. నా చావు నా చేతిలోనే ఉందిగాని, యీశ్వరాధీనం కాదు.

హిర :—ప్రతి దేశంలోనూ, ప్రతినియంతా, ఇలాగే గర్వపడేవాడు. కాని, ప్రతి వాడికీ చావు తప్పిందికాదు. నీకు నిజంగా చావంటే భయం లేకపోతే, ఇన్ని కాపలా లెందుకు? అచ్చు నీలాగే ఉన్న నలుగురైదుగురు ప్రతుల్ని ఎందుకు పెట్టుకున్నావు? నిర్భయంగా ఉపన్యాసా లియ్యవేం? స్వయంగా సేనల్ని నడపవేం? మరి నే నలాగా? నాకు ప్రతులు లేరు, కాపలాలు లేవు, నేనే నా సేనల్ని నడిపాను, మనుష్యులైనా దేవతలైనా యుద్ధానికి వస్తే, స్వయంగా యుద్ధంచేశాను. నీ కలా చేతకాదే! విమానాలూ, టాంకులూ, తుపాకులూ—ఈ యంత్రాలన్నీ నీతరఫున యుద్ధం చేస్తే, దర్జాగా కూర్చుంటావు. ఏదీ, నాతో గదా యుద్ధం చెయ్యి, కత్తిసాము చెయ్యి, ముష్టియుద్ధం చెయ్యి చూస్తాను. పురాణపు నియంతలతో పోలిస్తే, ఈ కాలపు నియంతలు పిరికి పందలు.

హిట్ల —(కోపంగా) ఈ కాలపు నియంతలంతా పిరికి పందలనడం నాకు చాలా అవమానం. ఎవరైనా పిరికి కావచ్చుగాని, నేను కాను. నాలో ఆర్య రక్తం ప్రవహిస్తూంది.

హిర :—అమాయకుడా! నిన్ను చూస్తే, నాకు జాలేస్తూంది. ఇంకా ఆర్యానార్య భేదం పాటిస్తూన్నావా? ఒక్క ఆర్యజాతే గొప్పదైతే, స్లావ్ జాతికి చెందిన రష్యావారు బెర్లిన్ పరిహద్దుకి రాలేకపోయి యుందురు. కంత్రీ జాతైన యింగ్లీషువారూ రాలేకపోయియుందురు. ఆర్యులూ, అనార్యులూ అని, నార్డిక్ స్లావ్ జాతులనీ, తెల్లవారూ, నల్లవారనీ ఈ భేదాలన్నీ నియంతలు తమ సర్వాధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం పన్నిన పన్నాగాలు. ప్రజలకుద్రేకం పుట్టిందంటే, మన నియంతృత్వాలాగవు సుమా! నేనూ నియంతనే గనుక, భూర్యానుభవంతో చెప్తూన్నాను.

హిట్ల :—(తెల్లబోయి) నువ్వన్నది నిజమనిపిస్తూంది. (బెంగబెరాటు పడుతూ) మరోలా గనుకోక పోతే, ఒక్క సందేహముంది, తీర్చుకోనా?

హిర :—ఓ. తప్పకుండా.

హిట్ల :—(పరీక్షించి చూస్తూ) ఆ కారుదేహం, ఆ దీర్ఘ రోమాలూ, ఆ వాడి కోరలు, పురాణాల్లో వర్ణించిన వవేవీ నీలో కనుపించవేం? నిన్ను రాక్షసుడంటా రెందుకు మరి?

హిర :—(అట్టహాసంతో) పుట్టుకతో ఎవ్వడూ దేవతా కాడు, రాక్షసుడూ కాడు. వాడు చేసే పనుల్ని బట్టి అతనికా దివిజత్వమో, రాక్షసత్వమో, ఆపాదిస్తూన్నారు. నాకన్న దేవేంద్రు డేవిధంగా గొప్పవాడో చెప్పు? అయినా అతన్ని దేవతన్నారు. ఎందుకంటే సాంఘిక నైతిక రాజకీయ శాసనాలకి లోబడి దైవభక్తితో, ప్రజాప్రభుత్వ విధానంలో పరిపాలించాడు, నేనో? అందంలో, వైభవంలో, సామ్రాజ్య విస్తీర్ణంలో, పరాక్రమంలో, తపశ్శక్తిలో దేవేంద్రుడికి తీసిపోను గదా? అయితేనేం? ప్రజలని దోచి, బాధించి, హక్కులు లేకుండా చేసి, నిరంకుశ ప్రభుత్వం వెలిగించాను. ఈ రాక్షస కృత్యాన్ని బట్టే నన్ను రాక్షసుడన్నారు.

హిట్ల :—చాలా సమంజసంగా చెప్పావు. అలాగైతే, ప్రజలు నన్నూ రాక్షసుడంటారా?

హిర :—ఆ! నీ యనంతరం, కొన్ని శతాబ్దాలు గడిచాక చరిత్రకారులు నిన్ను గురించి వ్రాసేటప్పుడు నిన్ను రాక్షసుడు గానే వర్ణిస్తారు. ఆ చరిత్రే పాతపడగా, పడగా పురాణమవుతుంది. నువ్వు పురాణ పురుషు డవుతావు.

హిట్ల —(చిన్నబుచ్చుకుని) కలియుగంలో రాక్షసుణ్ణి నే నొక్కడినేనా?

హిర :—ఏమీ, అలా గెందుకనుకోవాలి? నీ శత్రువుల్లోనూ ఉన్నారు కదూ? భారత దేశాన్ని ఎల్లకాలం దాస్యంలో ఉంచాలను కుంటూన్న సామ్రాజ్య వాదులు, నీగ్రోలని ఇప్పటికీ నీచంగా చూస్తూన్న వారూను!

హిట్ల :—(కన్నీరుతో)నియంతల బ్రతుకులు వృథా అన్న మాట. మేము మరణిస్తే, కన్నీరుకార్చే వాడొక్కడూ ఉండడన్న మాట!

హిర :—మనం సిగ్గు పడవలసిన దేమీ లేదు. విచారమూ అవసరం లేదు. ఒక్క నిరంకుశత్వం తప్పిస్తే, నియంతల్లో అన్నీ గొప్ప గుణాలే. వాళ్ల ప్రజలకి వాళ్లాప్తులే, సేవకులే. దుర్యోధనుడు, అలెగ్జాండరు, జూలియస్ సీజర్, నెపోలియన్ మొదలైన వారు మనలాంటి వారే. ఎంతధికారం చెలాయించినా, ప్రజల ప్రేమను పొందుతూనే ఉన్నారు. నీ ప్రజలు నిన్నెంతగా ప్రేమిస్తున్నారో, చూడు! దానికి కారణం నీ ఔన్నత్యమేనా?

హిట్ల :—(దుఃఖంతో) నా ప్రజలు దేవతలు.

హిర :—నువ్వు మరణిస్తే, ప్రజలంతా విచారిస్తారు. నరసింహుడు నన్ను చీల్చి చంపినప్పుడు అంతా నా కోసం జాలిపడినవారే. పాపం, రాజరాజు దుర్యోధనుడికి ఊరు భంగమయ్యాక ఎవరి గుండె కరగ లేదు? సీజర్ హత్య ఎంత విప్లవం తెచ్చింది? ఆ చంపిన వాడు పరమేశ్వరుడు నరసింహుడైనా, మానవుడు బ్రూటసైనా సరే, చంపిన వారి మీదే ప్రజల కాగ్రహం వస్తుంది. హతులైన నియంతలపై జాలీ వేస్తుంది. దానికి కారణం మనలో ఉన్న గొప్పే.

హిట్ల :—నువ్వు ధైర్యం చెప్పడంవల్ల మనశ్శాంతి కలుగుతూంది. (చిరునవ్వుతో) ఇంకొక్క వెర్రి సందేహముంది.

హిర :—దానికేం, అడుగు!

హిట్ల :—పై వారికేనా కన్నీరు వచ్చింది గాని, నిన్ను నరసింహుడు వధిస్తున్నప్పుడు నీ కొడుకు ప్రహ్లాదుడు కన్నీరు కార్చ లేదే? పై పెచ్చు నీ చావుకి కారణ మయాడు కదా? అయినా, నీ కతనిపైని అంత ప్రేమెందుకు?

హిర :—నా చావుకి నేనే కారణం. వాడు కాదు. వాడి ప్రజా సేవకి, దైవభక్తికి నేనడ్డు వచ్చాను. పరమేశ్వరుణ్ణి నేనే అని నమ్మమన్నాను. అది తప్పు కాదా? వాడు ధైర్యశాలి సత్యంకోసం త్యాగం చేసేవాడూ కనుకే, నన్ను ధిక్కరించాడు. పోనీ, చిన్నవాడు కదా అని ఊరుకోక, పితృప్రేమ చంపుకొని, అతి క్రూరంగా బాధించాను. అయినప్పటికీ వాడు నా పైని తిరగబడలేదే! ప్రాణరక్షణకోసం పట్టి ప్రార్థన మాత్రం చేశాడు.

హిట్ల :—(పళ్లుకొరుకుతూ) నీ కొడుకిని నా కప్పగించుంటే, ఆ భక్తి నీర వదిల్చేవాడిని, టాంకుల క్రింద మట్టించేసేవాణ్ణి. వీ టూ రాకెట్టులో పెట్టి అమెరికాకు ఎగర గొట్టేవాణ్ణి. విషవాయువు ప్రయోగించేవాణ్ణి. అప్పుడా ప్రార్థనా ఆగును, నువ్వూ బ్రతుకుదువు.

హిర :—పొరపాటుపడుతున్నావు. వాడి అహింసాతత్వాన్ని నీ యంత్రాలు నాశనం చేయలేవు. నాపైని వాడి కపరిమితమైన ప్రేమా, భక్తీని. వాడి ప్రార్థనవల్ల చావు వచ్చినది నాకు గాదు, నాలో ఉన్న రాక్షసత్వానికి. నాకున్న ప్రతిభ జీవించే ఉంది.

హిట్ల :—నీ బోధనకి చాలా కృతజ్ఞుణ్ణి. బ్రహ్మచారినవడం వల్ల నాకా పితృ హృదయం రాలేదు.

హిర :—(హిట్లర్ ప్రక్కకివచ్చి) సోదరా! ఏమీ అనుకోవని అడుగుతున్నాను. నీకు ఈవా మీద ప్రేమ కదా?

హిట్ల :—ఈవాకి నా పైనున్న గాఢ ప్రేమచూసి, నాకామెపైనభిమానం. కామానికి, విషయలోలతకీ, సంతానవాంఛకీ, నాకు వ్యవధి లేదు. నా జన్మ హేతువది కాదు. దేశంకోసం పోరాడవలసిన దెంతో ఉంది. నా దేశం సంపూర్ణ స్వాతంత్ర్య మనుభవిస్తూంటే, అప్పుడీవాతో సరస సల్లాపాలు.

హిర :—భేష్! నీ బ్రహ్మచర్యం దేశంకోసం గనుక, ఆదర్శమైంది.

హిట్ల :—నేను మరణించవలసి వస్తే, ఈవాని పెళ్లాడతాను. ఎందుకంటే, అప్పుడు నా అమూల్యమైన కాలం వ్యర్థం కాదు. వివాహానంతరము ఈవా నాతో సహగమనం చేస్తానంది.

హిర :—అదే, ఆదర్శ ప్రేమ, ఆదర్శ త్యాగం. ఈ ప్రేమ నీకున్న అప్రతిష్ఠని తుడిచి వేస్తుంది. నెపోలియన్ని ఇప్పుడన్ని దేశాలవారూ ఆదర్శ పురుషుడని యెంతగా నుతిస్తూన్నారో, నిన్నూ అలాగే చేస్తారు. నీ జీవితం ధన్యమయింది.

హిట్ల :—(సంతోషంతో) నీయంతటివాడు నాకీ గౌరవ మివ్వడం, నిజంగా, అదృష్టం.

హిర :—నిన్ను కలుసుకోవడం నాకంతకన్నా అదృష్టం. నువ్వేలోకంలో ఉన్నా, అప్పుడప్పుడు కలుసుకుంటానులే, ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. నీకు కలగా వచ్చి నిద్రలోంతా పాడు చేశాను. సెలవు. హెయిల్ హిట్లర్! (వెనక్కి నడుస్తూంటాడు.)

హిట్ల :—(ఆత్రంతో) అయ్యో! నాకు తీరుబడే. ఇంకా ఉండు.

హిర :—(వెనక్కి నడుస్తూ) ఇంకోసారి, ఇంకోసారి.

హిట్ల :—ఓం హిరణ్యకశిపాయనమః, ఓం హిరణ్యకశిపాయ నమః!

(వెనక్కి వెనక్కి నడిచి హిరణ్యకశిపుడు అంతర్ధానమై పోతాడు. హిట్లర్ కళ్లు నులుముకుంటూ నిద్రలేస్తాడు. చిరునవ్వుతో తెలతెల్ల బోతాడు.)



# అఖిల భారత మహిళా సభ

## — గ్రామ సేవ —

అఖిల భారత మహిళా సభ బెంగాలువంటి క్షామ పీడిత దేశాలలో శిశు సహాయ నిధులు, అనాధా శిశు శరణాలయాలు నెలకొల్పారు. ఆ పిల్లలందరికి బేసిక్ విద్యావిధానము ప్రకారము చదువు నేర్ప బడుతున్నందుకు సంతోషము. ఈ విద్యను పొందిన బాలబాలికలు శరీరధార్ఢ్యము మనో వికాసముకలిగి తాము నేర్చిన చదువు సత్ప్రవర్తనలను మూరింతలుగా తోటి గ్రామస్థులకు బోధించగలుగుతారని ఆశిస్తున్నాను. కస్తూర్బాస్మారక సంఘంకూడ ఏర్పడినది. ఆ నిధి వుద్దేశములు ఆశయాలు గాంధీజీ విపులపరచారు. ఆయన చెప్పిన దానిని పట్టి గ్రామాలలోని స్త్రీలకు ఎంతో లాభము వుంటుంది. కాని తోటి సోదరీమణుల బుద్ధి వికాసమును నైతిక, ఆర్థిక వున్నతిని పెంపొందింప చేయటానికి యేర్పడిన నిధికి స్త్రీలే ధర్మకర్త్రిణులు (trustees) కాలేని స్థితిలో వుంటము చాల శోచనీయము. ధర్మకర్త్రిణులంటే నా వుద్దేశము ఆ నిధి నంతను తమ యిచ్ఛప్రకారము ఖర్చుపెట్టగల అధికారిణులనే సంకుచిత అభిప్రాయము కాదు. అందుకు బదులు స్త్రీలు తమ యావచ్ఛక్తిని వుపయోగించి గ్రామ సేవ చేసి భగవంతుని ఆదేశమును శిరసావహించి నిజమైన ధర్మకర్త్రిణులు కావాలని నా అభిప్రాయము. అ. భా. మ. సభవారు కస్తూర్బా పని తాము నిర్వహించగలమని ఒప్పుకున్నట్లయితే గాంధిజీ తప్పక అంగీకరించి వుండే వాడు. కాని సభ తన విధాయకమును గుర్తించి ప్రజాసేవ చేసి వారి హృదయాలు ఇంకా చూరగొన లేక పోయిందన్న మాట. ఇకపైన ఆ సభ తన దృష్టిని మరల్చుకుని విశాల ఆశయాలతో భారత స్త్రీల ప్రాతినిధ్యముతో భారత స్త్రీల కొరకు పాటుపడే సంస్థగా తయారు కావటము ఉత్తమము.

—అమృతకౌర్



# గ్రామీణ స్త్రీలు - గ్రామ సేవ



—రాజకుమారి అమృత కౌర్‌గారి To Women అనే ఆంగ్ల గ్రంధము నకు తర్జుమా. పూర్వాధ్యాయములు ఆంధ్ర మహిళలో మార్చి సంచిక నుండి ప్రకటింపబడినవి. 'గ్రామ సేవికలకు' అనే రెండవ అధ్యాయము యీ సంచికతో ఆరంభమవుతుంది. ఇందులో గ్రామీణ స్త్రీలు గ్రామోద్ధారణకు యే విధముగా తోడ్పడగలరనే విషయము చర్చింపబడినది—



ఇంతవరకు మన సమాజ సేవా సంఘాలు గ్రామాలలో కాలు పెట్టలేదు. కాని భారత దేశము గ్రామాలతో నిండి వుండటమువల్ల అవి పునరుజ్జీవింపబడి అన్ని విధముల నైతిక, సాంస్కృతిక, ఆర్థిక ఉన్నతిని కలిగి వుంటేనే తప్ప దేశాభ్యుదయము కానేరదు. అఖిల భారత మహిళాసభ శాఖలన్ని ఒక్కొక్కటి ఒక్కొక్క గ్రామానినైనా తన పరిశీలనలో జాగ్రత్తలో వుంచుకున్నట్లయితే నిజమయిన దేశోద్ధరణ చేసినవాళ్లము కాగలమని చిరకాలముగ నా అభిప్రాయము. ఆ అభిప్రాయమునే మరొకసారి వ్యక్త పరుస్తున్నాను. మనలో చాల మంది పట్టణ వాసులు; గ్రామ జీవనానికి అలవాటు పడ లేదు. కాని గ్రామాలకు వెళ్ళివుంటేగాని ఆ గ్రామాలకు ఎంత మాత్రము సరిఅయిన సేవ చేయలేము. అఖిల భారత మహిళాసభ శాఖలు తమ జాగ్రత్త పరిశీలనలలో వున్న గ్రామాలకు తరుచు వెళ్ళిచూస్తుండటమువల్ల వేతనా లిచ్చి సమాజ సేవా సంఘమువారు నియమించిన పద్ధతుల ప్రకారము గ్రామ సేవ చేయటానికి మనుష్యులను నియమించటమువల్ల యీ విషయములో ఎక్కువ పని చేయటానికి అవకాశములు వున్నవి. యువతీ యువకులు గ్రామోద్ధరణకు తమ యావచ్ఛక్తి వినియోగ పరచేట్లు తగిన ప్రోత్సాహము ఇవ్వాలి. ఇటువంటి పనులలో ప్రవేశించే స్త్రీలకు కొంతవరకు యిబ్బందులు, అపాయములు వుంటవని అందరు ఒప్పుకోవాలి. మనస్ఫూర్తిగ గ్రామీణులతో కలసి మెలసి వుంటూ గ్రామ సేవ చేయాలనే సంకల్పమేవుంటే భార్యాభర్త లిద్దరు యీ సేవా రంగములో ప్రవేశించటము అత్యంత శ్రేయస్కరము. అంతగా యే యింబ్బందులైనా వున్నప్పటికి యెదుర్కోవాలి. ప్రస్తుత కాలములో సాహసమే జయమనే సూక్తిని మించిన సత్యము మరొకటి లేదు. గ్రామాలు ఆకర్షణీయముగా వుండవన్న మాట ముమ్మాటికి నిజము. గ్రామస్థులు

రచన :
రాజకుమారి అమృతకౌర్



తర్జుమా :
శ్రీమతి అచ్యుతుని గిరిజ

దారిద్ర్యము మాట అటుంచి చాల అజ్ఞానములో మునిగి వుంటారు. తత్ఫలితముగ యే విషయమును గురించి అయినా బాగోగులు విమర్శించి కనుక్కునే అభిలాషే లేక, నామ మాత్ర జీవితాలను గడుపుతు వుంటారు. క్రొత్త నేలను వేసిన పంట మామూలు కన్న ఎంతో త్వరగా ఫలిస్తుందని లోకోక్తి. ఆ విధముగానే మనకు దీక్ష, ఆసక్తి ఆత్మవిశ్వాసము వుండి తగినంత మంది పూనుకుంటే అనుకున్న దానికన్న త్వరలోనే గ్రామీణులకు విద్య నేర్ప గలుగుతాము గ్రామ పారిశుద్ధ్యాన్ని హెచ్చింప కలుగుతాము. తత్ఫలితముగ గ్రామాలు ఆరోగ్య విజ్ఞానాలలో తులతూగుతూ వుంటవి. కాని కార్యసాఫల్యము పొందటానికి సహనము, పరోపకారదీక్ష వుండి తీరాలి. ఎన్ని కష్టములు వున్నా లక్ష్యము పెట్టక కార్యరంగములో ప్రవేశించాలి. గ్రామములలోని స్త్రీలకు పిల్లలకు తమ ఆరోగ్యము కాపాడుకోవటము, యితరుల ఆరోగ్యము కాపాడటానికి సహాయపడటము, గ్రామ మంతటిని పరిశుద్ధముగా వుంచటము, విద్యా వివేకములు చక్కగా బోధించాలి. ఇన్నిటిని మించి వాళ్లకు పరస్పర సహకారములో యిమిడి వున్న మహత్తును శ్రేయస్సును విశదపరచాలి. ఊరంటే అందరిదన్నినీ, ఆరోగ్యరక్షణకు కందకాల మరుగుదొడ్లు ఏర్పరచాలను కుంటే అది గ్రామ మంతటి కోసమేననిన్నీ మరువక గ్రామస్థు లందరు సహకారము చేయాలి. వూరిలో వుండే మిట్ట పల్లాలను సరిచేసి చక్కని బాటలు వేయాలంటే నలుగురు ఏకీభవించి పని చేయాలి. ఒక బడిని నెలకొల్పారంటే పిల్లలందరు అక్కడ చదువుకోవాలి. ఏ గృహ పరిశ్రమో పునరుద్ధరింపబడితే ఆ తయారయిన సరుకు గ్రామస్థులందరు వుపయోగ పరుచుకోవాలి. తాము అందు కావలసిన గుడ్డలను ఆహారమును జాగ్రత్త పరుచుకుని మిగిలి వున్నవే బయటి వూళ్లకు పంపాలి. పంచాయతిని తిరిగి ఆచరణలో పెట్టేటట్టుగా వుంటే పురుషులతోపాటు స్త్రీలుకూడ తమ ఓటిచ్చి పంచాయతి సభ్యులను ఎన్నుకోవటము చాల ఉత్తమము. గ్రామమంటే గ్రామస్థులు గర్వపడేట్లుగా వుండాలి. అప్పుడప్పుడు ఒక గ్రామానికి యింకొక గ్రామానికి పోటీలు చేయాలి. ఆ పోటీలో తమ గ్రామమే గెలిచి తీరాలనే పట్టుదలతో గ్రామస్థులు తమను తమ పరిసరాలను ఎంతో పరిశుభ్రముగ వుంచుతు యీ సేవలో నిమగ్నులైన యితర సమాజ సేవకులకు కూడ ఎంతో సహకారము చేస్తారు. పరస్పర సహకారము సర్వశ్రేయో మూలమనే పరమ ఆశయమును గుర్తించితే గ్రామస్థులు తమ తగాదా పరిష్కారముల కోసము వ్యర్థపు ఖర్చులు చేయక తమలో తామే పరిష్కరించుకుంటు స్వతంత్ర జీవనము చేయ గలుగుతారు. సహకారములో వున్న మహత్తును గుర్తించి గ్రామస్థులందరు నడచుకుంటే దేశములో వున్న అనైక్యత, విద్వేషాలు సమూలంగా శాశ్వతముగా నశించి పోగలవు కాబట్టి ఆ సహకార భావాన్ని పెంపొందింప చేయటము మన ముఖ్య కర్తవ్యం. గ్రామోద్ధరణకు పూనుకున్న సేవకులు తమ యిండ్లను పరిసరాలను అతి శుభ్రముగా వుంచాలి. చేతితో విసిరిన గోధుమ పిండి, దంపుడు బియ్యము, తమ గ్రామములోనే పండిన

కాయలు (కూరలు పండ్లు తింటు ఏదో వొక చేతి పని (యంత్ర సహాయము లేక, చేతులతో చేసే పని) చేస్తువుండాలి. ఈ విధముగ గ్రామ సేవకులు తాము చెప్పే ప్రతి అక్షరమును ఆచరణలో పెట్టినట్లయితే కొంత కాలమునకైనా ప్రతి వారు వీరిని మార్గదర్శకులుగా పెట్టుకుని యింతను మించి తాము పాటిస్తారు. బస్తీలలో వున్న మంచి నీటి, ఆరోగ్య విషయక, విద్యా విషయక సమస్యలు, అస్పృశ్యత, బాల్యవివాహము మొదలైన సాంఘిక సమస్యలు అన్నీ గ్రామాలలోకూడ వున్నవి. ఇంకా కొన్ని ప్రదేశాలలో జూదము త్రాగుడు వంటి దురభ్యాసాలు కూడ వున్నవి. వీటినన్నిటిని గురించి ఆలోచించి పరిష్కరించాలి. ప్రతి చోట గ్రామస్థులకు తీరిక సమయములలో చేయటానికి వీలైన ఆర్థికముగా లాభించే చేతి పనులను పునరుద్ధరించాలి. నూలు వడుకుట నేత ఎంతో పెంపొందిపవలసిన చేతి పనులని యిదివరకే వ్యక్తమయింది. ఏయే ప్రాంతములలో యేయే చేతి పనులు ప్రసిద్ధి చెంది సులభముగ చేయటానికి వీలుపడుతుందో అని ఆ యా ప్రాంతాలలో పునరుద్ధరించి ఆచరణలో పెట్టాలి. ఇంక పిల్లలకు చదువు నేర్పవలసిన అగత్యము వున్నది. వృత్తి విద్య యేదైనప్పటికీ అసలు బేసిక్ విద్యావిధానము ప్రచారములో వుండాలి. ఈ బేసిక్ విద్యావిధానమును గురించి ఆసక్తివుండి సేవచేయ తలుచుకున్న స్త్రీలు శ్రీమతి ఆశాదేవిని సంప్రదించి తగు సలహాలు,ఆ విధానములో తర్ఫీదుకూడ పొందవచ్చును. విద్యార్థినులు తమకున్న తీరిక సమయములో ముఖ్యముగా శలవు రోజుల్లో తమకు సమీపములో వుండే గ్రామాలలో గ్రామ సేవ చేయవచ్చును. నేనింతకు ముందు భార్యా భర్తలిద్దరు కలిసి నిర్విఘ్నముగ గ్రామ సేవ చేయటానికి ఎక్కువ అవకాశములు వుంటవని అన్నాను. అంటే సోదరీ సోదరు లిద్దరుకాని, ఇద్దరక్క చెల్లెండ్లుగాని, ఇద్దరు స్నేహితులుగాని సరిగా సేవ చేయలేరని నా భావము కాదు. ఏకాకిగా ఒక యువతి పొరుగు గ్రామానికి వెళ్ళి అక్కడ వంటరిగా నివసిస్తు పని జేయటము చాల కష్టము కాబట్టి పై విధముగా అనవలసివచ్చింది. ఒంటరిగా యువతులు వుండటమువల్ల వారు యెదుర్కొన వలసిన యిబ్బందులు కష్టములకన్న తమకు సరిఅయిన బుద్ధి చురుకు వికాసముగల వారుతోడులేక పోవటమువల్ల వారిలో ఒక విధమైననిరుత్సాహము, మాంద్యము కలగటానికి యెక్కువ అవకాశము వున్నది. అదీ కాక గ్రామ సేవ అంటే అంత సులువు కాదు. వంటరిగా యెవరూ సాధించ లేరు. తప్పక కొంత సహాయము అవసరము. కాని జీవితమే సాహసమయము. సాహసులే స్థిరమైన పేరు సంపాదించుకో గలుగుతారు. ఇంత విశాల మాతృభూమి భవిష్యత్తును హస్త గతము చేసుకున్న వారి సాహసమును గురించి మనము శంకించక ఆశతో ఎదురుచూతాము.



# రాజకీయములు

వివిధ దేశాలలో స్త్రీ లందరియొక్క ప్రధాన సమస్యలు ఎలాగైతే పూర్తిగా పరిష్కరింపబడగలవో వెనుక చూసేము; కాని ఆ సమస్యలు ఒకదానితో ఒకటి సోక్యము లేనివి కాక, అన్నీకూడా అంతర్ సంబంధాలు కలిగి ఉన్నాయని గుర్తించాలి. వానిలో అవి సంబంధాలు కలిగి ఉండడమే కాక, దేశంలోని ఇతర పరిస్థితులమీద, ముఖ్యంగా రాజకీయ, ఆర్థిక పరిస్థితులమీద ఆధారపడి ఉంటాయి. కనుక ఈ సమస్యల పరిష్కారానికీ, రాజకీయ మార్పులకి కూడా సంబంధముంటుంది. ఈ సమస్యల పరిష్కారానికి సూచింపబడిన మార్గాలు ఒక దేశంలోని అప్పటి పరిస్థితులకు వెంటనే అనుగుణ్యంగా అగపడక పోవచ్చును. అందుకని తాత్కాలిక అభివృద్ధికి వేరు మార్గాలు అన్వేషింప బడినా, మొత్తంమీద, స్త్రీల హక్కులను పూర్తిగా గుర్తించాలంటే స్త్రీల ప్రధాన సమస్యలకు వెనుక చెప్పిన పరిష్కారములను ఎప్పటికో ఒకప్పటికి సాధించవలసినదే. కావలిస్తే అందుకు తగిన రాజకీయ మార్పులతో సహా ప్రయత్నించాలి. ఇంక ఈ సమస్యల అంతర్ సంబంధాలేమిటో, పరిష్కారానికి కనువైన రాజకీయ పరిస్థితులేమిటో చూద్దాము.

మహమ్మదీయ స్త్రీకి విడాకుల హక్కు ఉంది. అయితే, ఏమి లాభం? మొగుడు తన్నినా, తిట్టినా, ఎటువంటి వాడైనా ఆతడి దగ్గరే పడివుంటుంది. ఎందుచేత? తనను, తను పోషించుకో లేక పిత్రార్జితం బాగా ఉంటే, ఫరవా లేదు. లేకపోతే సాంఘిక పరిస్థితులవలన సంపాదించు కొనే శక్తి కలిగి ఉండక పోవడం మూలాన, ఆ భర్త దగ్గర బాధల కోరుస్తూ, గడుపుతుంటుంది. కనుక స్త్రీకి వివాహ స్వాతంత్ర్యం, విడాకుల హక్కు ఇచ్చినంత మాత్రాన లాభంలేదు. ఆర్థిక స్వాతంత్ర్యమూ, ఆర్జించుకొనే శక్తి ఉంటేగాని, ఆమె తన వివాహ స్వాతంత్ర్యాన్ని విడాకుల హక్కును అత్యవసరమైనప్పుడైనా ఉపయోగించుకోలేదు.

ఇక స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యముండాలి, స్త్రీలంతా పురుషులవలెనే ఉద్యోగాలలో చేరే అవకాశాలు, పరిస్థితులు ఉండాలంటే, అది చెప్పినంత సుళువుకాదు. అసలు యంత్రాలవలన కేపిటలిస్టు దేశాలలో కొంత నిరుద్యోగం వస్తుంది. దానికితోడు స్త్రీలంతా కూడా ఉద్యోగాల కోసం బయలుదేరితే, నిరుద్యోగ సమస్య ఎక్కువవుతుంది. అందుచేత స్త్రీలను కొంతవరకు నిరుత్సాహ పరచవలసిన అవసరం కలుగుతుంది. నాజీ జర్మనీలో నిరుద్యోగ సమస్యను తీర్చడానికే స్త్రీలకు వంటిళ్లు చూపెట్టేడు హిట్లరు. స్త్రీల ఆశయం దేశానికి ఉపయోగించే సైనికులను కనడం, వండి పెట్టడం అన్నాడు. ఇతర కేపిటలిస్టు దేశాలలోకూడ నిరుద్యోగ సమస్య తీవ్రమైనపుడు, స్త్రీలు గృహములో నిర్వహించగలిగిన ఉత్తమ ఆశయాల గురించి ఉపన్యాసాలెక్కువ అవుతాయి. స్త్రీకి పూర్తిగా ఆర్థిక స్వాతంత్ర్యమివ్వగలిగినది సామ్యవాద పద్ధతులపైన నడిచే రష్యా ఒకటే. ఈ పద్ధతిలో నిరుద్యోగానికి తావులేదు. స్త్రీ లెంత మంది ఉద్యోగాలకు బయలుదేరి వచ్చినా సరే, ప్రభుత్వము అందరికీ ఉద్యోగాల నిప్పించే బాధ్యత తీసికొంటూంది. ఏ వ్యక్తి అయినా సరే ఉద్యోగము కోరినపుడు అది ఒక హక్కు క్రింద పరిగణింపబడి యీయబడుతుంది. కనుక స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యము రావాలంటే, ప్రతి రాజకీయ వాతావరణంలోను అంత సుళువుగా రాలేదు. ఆస్తి విషయాలలో కొన్ని మార్పులు రావచ్చును. ఉద్యోగాల విషయాలలో స్త్రీలమీద ప్రభుత్వం నిషేధం తొలగించవచ్చును. అటువంటివి వెంటనే జరగవలసినవే కాని వాటివలన ఆస్తి పరులకు, ఎక్కువ విద్యావంతులకు కొద్ది మందికి మాత్రమే

* మొదటి ఎనిమిది వ్యాసములు (వివాహము, ఆర్థికసమస్య, బిడ్డలు, వంట, ఆరోగ్యము, విద్య, పడుపువృత్తి, మతము) క్రిందటి నవంబరునుండి వరుసగా ఆంధ్ర మహిళ సంచికలలో ప్రకటింపబడినవి.

లాభము కలుగుతుంది. మిగతా వాళ్లందరి కష్టాలు దీనివలన పోవు. స్త్రీలందరూ స్వయం సంపాదన చేసుకొనవలెననే ప్రజాభిప్రాయము, చేసి కొందుకు తగిన పరిస్థితులు ఉంటే కాని, స్త్రీకి పూర్తియైన ఆర్థిక స్వాతంత్ర్యము రాదు. అలాగే వచ్చేందుకు సామ్యవాద సంఘ మవసరము.

ఉద్యోగం చేసి కొందుకు సిద్ధాంత రీత్యా హక్కు ఉన్నంత మాత్రాన స్త్రీ దానిని వినియోగించుకోలేక పోవచ్చును. బిడ్డలు, వంట సమస్యలు తీర్చబడక పోతే, ఆలుమగలలో ఎవరో ఒకరు వీనిని చూడాలి కనుక స్త్రీని ఇందుకు తొక్కిపెట్టడం జరుగుతుంది. కనుక వైవాహిక జీవితం కావలసిన స్త్రీ ఉద్యోగం చేసుకోలేక పోతుంది. అసలు ప్రభుత్వాలే వివాహితులైన స్త్రీలను చాల ఉద్యోగాలకు నిషేధించి, అవివాహితులనే నియోగించాలంటున్నాయి. అది చాలా అన్యాయం. పురుషుడు వైవాహిక జీవితాన్ని, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని రెండింటిని ఒక్కమారుగా కలిగియున్నా, స్త్రీ రెండింటినీ ఒక్కమారుగా కలిగి ఉండలేక పోతూంది. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వమే ఆమెకు అలా కలిగి ఉండే హక్కు లేకుండా చేస్తూంది. స్త్రీకి ఈ అన్యాయం పోవాలంటే, బిడ్డలు, వంట సమస్యలు పరిష్కారమవాలి. ప్రభుత్వము స్త్రీలకు ఈ రెండు విషయాలలోను చాలా ఎక్కువగా సహాయం చెయ్యాలి. స్త్రీలకు ఈ సౌకర్యాలు చేయవలసిన అవసరం కేపిటలిస్టు ప్రభుత్వాల కగపడదు. అలా చేసినందువల్ల కేపిటలిస్టులకు లాభాలేమీ రావు. ప్రజా సామాన్యము యొక్క క్షేమానికి పాటుపడే ప్రభుత్వమైతేనే, అర్ధ భాగమైన స్త్రీల శ్రేయస్సు కొరకు, ఎంత వ్యయానికైనా ఓర్చి స్త్రీలందరికీ ఇటువంటి ఏర్పాట్లు చేయగలదు. అటువంటి ప్రభుత్వము ఈ రెండు సమస్యలను పరిష్కరించినపుడే, స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యానికి అర్థముంటుంది.

స్త్రీలకు వచ్చే ప్రత్యేక అనారోగ్యాన్ని ఎదుర్కోవాలంటే ప్రభుత్వపు వైద్య సహాయం ఉచితంగా, చాలా ఎక్కువగా ఉండాలి. అలా ఉండాలంటే, దేశంలోని వైద్యశాఖ అంతాకూడా ప్రభుత్వాధి కారంలో ఉండాలి. అలాగ ఉన్నప్పుడే వైద్య సహాయం ప్రజాసామాన్యాన్ని చేరగలదు. అది సామ్యవాద ప్రభుత్వం క్రింద సులభ సాధ్యము. రష్యను వైద్యశాఖ ప్రజలకు చేస్తున్న సేవచూసి ఇతర దేశాలలోని వైద్యులుకూడా కొందరు వైద్యశాఖ పూర్తిగా ప్రభుత్వాధికారంలోనికి తీసికోబడాలని అలజడి చేస్తున్నారు.

స్త్రీలందరికీ కూడా ఉద్యోగాలను చూపగల ధైర్యం లేని ప్రభుత్వం స్త్రీలందరూ విద్యావంతులవాలనికించ పడదు. నాగరికతా సూచకంగా కొందరు విద్యావంతులైన స్త్రీలుంటే చాలును. కాని సామ్యవాద ప్రభుత్వపాలనీ క్రింద లెనిన్ "ప్రతి ఇంటి పనిగత్తెకూడా రాజ్యాన్ని పరిపాలించగలిగి ఉండాలి" అన్నాడు. అవును, ఆమెకు పరిపాలనా మార్గాలు తెలిసినప్పుడే, తనకు నచ్చిన మార్గాలలో పరిపాలించే వానికే వోటు నిచ్చే విచక్షణ జ్ఞానం కలిగి ఉంటుంది. అలాగ ఏర్పడిన ప్రభుత్వమే ప్రజాభిప్రాయాలకి సరియైన ప్రాతినిధ్యము వహిస్తుంది.

ఇలాగ ఈ సమస్యల అంతర్ సంబంధాలను పరిశీలిస్తే వీనిలో కొన్నిటిని మాత్రమే పరిష్కరించినందువలన అంతగా లాభంలేదనీ, అన్ని సమస్యలూ పైచెప్పిన మార్గాలలో పూర్తిగా పరిష్కరింపబడినపుడే, స్త్రీలందరికీ విముక్తికలుగుతుందని తోస్తుంది. ఇవి అన్నీ పూర్తిగా పరిష్కరింపబడడానికి, సరియైన రాజకీయ వాతావరణం అవసరం. స్త్రీలందరికీ రాజకీయాలలో ప్రాథమిక హక్కు అయిన వోటు అత్యవసరము, అది తప్పక ఉండాలి అన్న మాట అటుంచి, అలాగ వోటింగు హక్కు ఉన్నాకూడా ఈ పరిష్కారములు జరగడం కష్టం. స్త్రీలందరికీ ఆర్థిక స్వాతంత్ర్యమును అందచేసి, అందుకు అవసరమైన సంస్థల నన్నీ స్థాపించగలిగినది సామ్యవాద ప్రభుత్వ మొక్కటే. వైద్యశాఖ పూర్తిగా ప్రభుత్వశాఖ క్రిందమార్చి, స్త్రీలందరికీ ఉచిత వైద్య సహాయము నివ్వగలిగినదీ సామ్యవాద సంఘమే. అలాగే విద్యలో పెద్ద విప్లవాన్ని తీసికొనివచ్చి, స్త్రీలందరికీ విద్య నిప్పించగలిగినది, వారికి అందుకు అనువైన పరిస్థితులను ఏర్పరచగలిగినదీ సామ్యవాద ప్రభుత్వమే. ఇతర ప్రభుత్వాల క్రింద స్త్రీ పురుషుల సమానత్వము గుర్తింపబడ్డా, ఆ దిక్కులో కొన్ని మార్పులు జరుగుతున్నా పూర్తి

సమానత్వం ఆచరణలోకి రాలేదు. సామ్యవాదం క్రిందనే పురుషునితోపాటు స్త్రీకి ప్రతి విషయంలోనూ కూడా సమానత్వము రాగలదు. కనుక స్త్రీల సంఘాలు తమ హక్కుల కోసం పోరాడేటప్పుడు, సామ్యవాద పద్ధతుల పైన నడిచే ప్రభుత్వం కోసంకూడా పోరాడాలి. అప్పటి పరిస్థితుల్లో వీలైన మార్పులు తెచ్చుకోడానికి ప్రయత్నించడంతో ఊరుకోక, అదే సమయంలో తమకు పూర్ణ విముక్తి నీయగలిగిన పరిష్కారాల కొరకు, దాని కనువైన రాజకీయ వాతావరణం కొరకు పోరాడుతూ ఉండాలి. అటువంటి పోరాటంలో నెగ్గి, ఈ సమస్యలనన్నీ పరిష్కరించుకొనిన నాడే, స్త్రీలు పురుషులతోపాటు సర్వ విధాలా సమాన హక్కులు కలిగి, తమ ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకొన గలిగి, ధన్యులౌతారు. స్త్రీలంతా అలాగ పురుషులతో సమానత్వము స్థాపించుకొనిన నాడు, మానవ చరిత్రలో నూతన శకం ఆరంభ మవుతుంది.





భార్యయన్న భరింపబడునది,
భర్తయన్న భరించువాడని—
పంతులెన్నడో నొడివెబడి, నిం
దెవరు భర్తో, యెవరు భార్యో
ఎఱుకగలిగిన గఱువలుంటే
ఇంత చెప్పెదరా ?



# కుటీర పరిశ్రమలు — మహిళల బాధ్యత

✻ డాక్టర్ మిస్ డి. యస్. రాజలక్ష్మిగారి వ్యాసాన్ని అనుసరించి ✻

భారతదేశానికి నవయుగోదయ కాలమిది. మహా భయంకర సంగ్రామ సమాప్తితో — దేశ దేశాలలో మహోజ్వలంగా జాతీయ చైతన్యం రేకెత్తినది. అనేక రాజ్యాల ప్రజలు తమ్ము శతాబ్దాను శృతంగా బంధిస్తు వచ్చిన దాస్య శృంఖలాలను భగ్నమొనర్చి, స్వాతంత్ర్య సమరాలను సాగిస్తున్నారు. రాజరికాధికార పాశాలనుండి విముక్తులై ప్రజలు స్వతంత్ర స్వపరిపాలన ప్రభుత్వాలను స్థాపించుకొంటున్నారు. ఏ సూత్రాలు ఏ స్వాతంత్ర్యాల పరిరక్షణకైతే మిత్ర రాజ్యాలు యుద్ధం చేస్తున్నామని ప్రకటించినవో, ఆ సూత్రాలను ఆచరణలో పెట్టడానికి తమకు తామై పూనుకొంటున్నారు. తమ స్వాతంత్ర్యానికి, తమ దేశోన్నత్యం హెచ్చడానికి, తమకు కడుపునిండ తిండి — ఒంటినిండా బట్ట లభించడానికి అనేక విధాల కృషి చేస్తున్నారు. పరిశ్రమలను స్థాపించుకొంటున్నారు. ఉత్పత్తులను అధికం చెయ్యడానికి యత్నిస్తున్నారు.

యుద్ధం కారణంగా మనకు అనేక సమస్యలు ఏర్పడినవి. యుద్ధానంతర పునర్నిర్మాణంలో స్త్రీలు నిర్వహించవలసిన బాధ్యతలు అనంతంగా వున్నవని స్పష్టపడింది. యంత్రాల ఉపయోగం తేటపడింది గాని ఆ యంత్రాల ఉత్పత్తికి మన దేశంలో అవకాశం లేదు.

యుద్ధకాల పరిశ్రమలు — ప్రయత్నాలు శాంతి కాలానికి అనుగుణంగా మార్చవలసి వచ్చిన పరిస్థితిలో ప్రతీ దేశానికీ కొంత ఇరకాటం ఇబ్బంది తప్పవు. అల్లాగే మన దేశంలో కూడా సంభవించింది. సరఫరాలలో — ఉత్పత్తులలో — రవాణాలోని అనివార్య ప్రతిబంధకాలు — సమ్మెలు — రాజకీయ రంగంలో నూతన సమాలోచనలు — వీటి మధ్య ప్రజలకు తాత్కాలికమైన ఇరకాటం సంప్రాప్తించింది.

లంకషైర్ గుడ్డలు కరువైనాయి. గ్లాస్గో గగనకుసుమమయింది. మిల్లు చీరలు మాయమై చేనేత చీరలకు ఎక్కువ ధర పెట్టి మరీ ఎగబడవలసి వచ్చింది. బియ్యం తమ సున్నితాన్ని కోల్పోయినవి. ముడిబియ్యం — బాగుచెయ్యనివి — రకరకాలలో — రంగురంగులలో ప్రత్యక్షమైనవి.

బియ్యానికి ప్రత్యామ్నాయంగా గోధుమలు, జొన్నలు, రాగులు, చోళ్లు మార్కెట్‌లో సాక్షాత్కరించినవి.

దైనందినావసరములైన పాలు, కిరోసెన్ మొదలైన వాటికోసం తాపత్రయం హెచ్చింది.

ఈ ఇబ్బడి ముబ్బడి పరిస్థితికి అంతకూ కారణం మనం కుటీర పరిశ్రమలను అలక్ష్యం చెయ్యడమేనని చెప్పవచ్చు. తాత్కాలికమైన ఈ చిక్కు పరిస్థితి నెదుర్కొనడానికి మనం సంసిద్ధులం కాక పోవడానికి కూడా ఇదే కారణం.

కుటీర పరిశ్రమలను మనం ప్రోత్సహిస్తునే వున్నట్లయితే మన దేశ ప్రజలు లక్షలాదిగా కూటికి గుడ్డకు మొగము వాచి, క్షుధార్తితో నశించిపోవలసిన పరిస్థితి ఏర్పడకుండా వుండేదని నా విశ్వాసం.

కుటీర పరిశ్రమలలో స్త్రీలకు కూడా అనల్పమైన బాధ్యత వున్నది. యుద్ధం రాగానే పురుషులు అనేక మందికి ఉపాధి లభించింది. ఉద్యోగాలు దొరికినవి. మంచి జీతం సంపాదించగలిగారు. కాని స్త్రీల మాట ? భర్తలు విదేశాలనుంచి, యుద్ధరంగాన్నుంచి పంపిస్తున్న డబ్బు ఖర్చు పెట్టుకొనడానికైతే సులువుగావుంది కాని చేతినిండా పని మాత్రం లేదు. కుటీర పరిశ్రమల పట్ల అదేమో అశ్రద్ధ. అలక్ష్యం, అసహ్యం, నిరుత్సాహం కలిగినవి. వీటి మూలంగానే ఒక మహత్తర సందేశంగల ఆ పరిశ్రమలు — పీడిత ప్రజాకోటికి ముక్తి కలిగించగల ఆ పరిశ్రమలు క్షీణించి పోయినవి. మన దేశంలోను కుటీర పరిశ్రమల పట్ల ప్రజలు అలక్ష్యం చూపలేదు. భారత దేశంలో వాటికి రాజకీయంగానే ప్రాధాన్యం ఏర్పడింది.

కేవలం ఇంటిపని — వంటతప్ప మరేయావత్తులేని స్త్రీల విషయం తీసుకోండి. వీరికి కావలసినంత తీరిక. వీరు వృత్తిగా — జీవనోపాధిగా గాక పోయినా, కులాసా కోసం,

కాలక్షేపం కోసం అయినా కుటీర పరిశ్రమలను సాగించవచ్చు.

యంత్రాలు రాగానే పనిలో సుళువు ఏర్పడిన మాట వాస్తవమేగాని అనేకుల కూట్లో దుమ్ముకూడా పడింది. నాయకులు కుటీర పరిశ్రమల ఆవశ్యకతను, ప్రాధాన్యాన్ని గురించి ఎంత ఘోషించినా ప్రజల చెవుల కది చేరనే లేదు.

పారిశ్రామికంగా భారత దేశం తల ఎత్తుకోవలెనంటే కుటీర పరిశ్రమలను ప్రోత్సహించక తప్పదు. నూలు వడకడం, గుడ్డలు నెయ్యడం మొదలైనవి ఒక నిర్ణీత కార్యక్రమం ద్వారా పునరుజ్జీవింప చేయడం అవసరం.

వీటిని పాఠశాలలలోకూడా చేర్పించడానికి కాంగ్రెస్ ప్రభుత్వాలు పూనుకోవాలి.

యంత్ర యుగానికి పూర్వం కుటీర పరిశ్రమల మూలంగా జీవనోపాధిని సంపాదించు కొంటున్న స్త్రీల సంఖ్య ఫ్యాక్టరీలలో పని చేస్తున్న పురుషుల సంఖ్యకంటె ఎక్కువగా వుండేదట.

చైనాలో కుటీర పరిశ్రమలు చెదురుగా వుండటం వల్లనే జపాను సైన్యాలు, విమానాలు ఒక వంక విపరీతమైన విధ్వంసన సాగించినప్పటికీ ప్రజలు చాల మట్టుకు తట్టుకో గలిగేరు.

భారత దేశంకూడా బహు విశాలమైనది కావడంవల్ల కుటీర పరిశ్రమల విస్తృతవ్యాప్తికి అపారమైన అవకాశాలు వున్నవి.

ఇవి దేశంలోని ప్రతీ నగరంలోను, పట్టణంలోను, పల్లెలోను ఏర్పాటు చెయ్యడం అవసరం. తాత్కాలికావసరాలు తీరడానికే గాక ఇవి శాశ్వతంగా కొనసాగడం ముఖ్యం. ప్రభుత్వ పోషణ—ఆదరణ వీటికి విధివిహితంగా వుండాలి. అప్పుడే ప్రజలకు కరవు బాధ వుండదు. ప్రశాంత, సంతృప్తికర జీవనానికి అవకాశం వుంటుంది.

భారత దేశపు భావి పరిశ్రమాభ్యున్నతికై మహిళలు అత్యంతమైన బాధ్యతను నిర్వర్తించవలసి వున్నారు. దేశాభ్యుదయా కాంక్షులైన స్త్రీలు పురుషులు కూడా ఇకనైనా తమ అలసత్వంలోని ప్రమాదాన్ని గుర్తించి తక్షణ కార్యాచరణకు పూనుకోవడం అవసరం. అలా చేసిన నాడే భారత ప్రజలకు శాంతి, భారత దేశానికి ముక్తి.



అతి జనసమర్దమైన బెంగాల్‌లో సేదదీర్పు పానీయముగా టీనే కావాలంటారు—వేసవిలోను, చలికాలంలోనూగూడా.

ఎల్లప్పుడూ తాజాగా వుంటుంది కాబట్టి స్త్రీ పురుషులు బ్రూక్‌బాండ్ టీనే భారతదేశమంతటా వుపయోగిస్తారు.

# బ్రూక్ బాండ్



రెండాకులు ఒక మొగ్గ



# గాంధీజీ ఏమంటారు?

అనువాదం : శ్రీమతి పి. సరస్వతిగారు

పతిదర్ ఆశ్రమంలో ఒకరు శ్రీ నరహరి ప్రకాశ్ గారికి యీ విధంగా రాశారు.

"మహాత్మాజీ భారతదేశ రాజకీయాలలో ప్రవేశించినప్పటినుండి, అస్పృశ్యతా నివారణకు కావలసినంత చేయూత లభించింది. ప్రస్తుతం విద్యావంతులలో ఆభేదమే నిర్మూలం అయింది. కాని పరిపూర్ణత పొందలేదు. హరిజన యువతులు సవర్ణ హిందూ యువకులను వివాహం చేసుకుంటే, హరిజనోద్ధరణకు పూర్తి అవకాశాలు వుంటాయి.

"ఈ సలహా యివ్వటం సులభమేకాని, క్రియారూపం దాల్చాలంటే, కొంచెం ఆలోచనీయాంశమే. సాధారణంగా సంఘంయొక్కగాని, దేశంయొక్కగాని అభ్యున్నతి, విద్యావతులైన స్త్రీలమీద ఆధారపడివుంటుంది. హిందూదేశంలో స్త్రీ విద్య యింకా మొగ్గ తొడగటంలోనేవుంది. అందులో హరిజనులలో విద్యావతులైన స్త్రీలను వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చును. ఒకరిద్దరు విద్యావతులు వెళ్లి, సవర్ణ హిందువులను వివాహం చేసుకుంటే, పర్యవసానం, వారి సంఘానికి దూరం అయిపోటం, భర్తకుచెందిన వాతావరణంలోనే ఐక్యం అయి, తమవారికి నిరుపయోగం అయిపోవటం. ఈ విధంగా జరిగిన ఒకరిద్దరి వివాహాలను గురించి నాకు తెలుసు. విద్యావతులైన స్త్రీలు అల్లాంటి పరిస్థితులలో చిక్కుకోటం, చెప్పుకోతగ్గదికాదు. ఈ పద్ధతి వివాహాలను ప్రోత్సహించటంవల్ల బాపూజీ హరిజనులకు అజ్ఞానాంధకారంనుంచి బైటకు రానియ్యకుండా బంధించినవారవుతారు. ఒకవేళ చేసుకుంటే, దంపతులిద్దరు హరిజనోద్ధరణకు బద్ధ కంకణులై, అదే ఆశయంతో చేసుకోవాలి, లేదా హరిజన యువతులు, తమ జాతివారినే చేసుకుని చేతనయినంత సంఘసేవ చెయ్యాలి.

"మా ఆశ్రమంలో హరిజనులు, సవర్ణ హిందువులుకూడా వున్నారు. హరిజనులలో ఒక యువకుడు నన్నీలా ప్రశ్నించాడు.

—"విద్యావతులైన సవర్ణ హిందూ యువతులు, హరిజన యువకులను వివాహం చేసుకోమని బాపూజీ యెందుకు ప్రోత్సహించరు? నిజంగా బాపూజీ యివ్వవలసిన సలహాయిదేను. సవర్ణ హిందూ యువతులు మాలో తిరుగుతూ వుంటే, మా యువతులుకూడా చాలా విషయాలు వారి దగ్గఱనుంచి నేర్చుకుని వృద్ధిలోకి రావటానికి యెక్కువ అవకాశాలు వుంటాయి."

## హరిజన యువకులతో సవర్ణ యువతుల వివాహాలు

"దీనికి నేనే జవాబు చెప్పివుండునుగాని, బాగా నిదానంగా ఆలోచించవలసిన విషయం గనక, అందుకు సమర్థులు బాపూజీ కదా, వారే విధంగా జవాబు యిస్తారోనని వ్రాస్తున్నాను."

## గాంధీజీ జవాబు

విద్యావతి అయిన హరిజన యువతి సవర్ణ హిందూని వివాహం చేసుకుంది అంటే, దంపతులిద్దరు వారి జీవితాలు హరిజనోద్ధరణకొఱకు పాటుపడటమే వారి ఆశయంగా యెంచి చేసుకోవాలని నా ఉద్దేశ్యంకాని, వారి స్వసౌఖ్యం కోసంకాదు. అదెప్పటికీకూడా సరయిన పద్ధతి కాదు. నేను అల్లాంటి వివాహాలు యెప్పుడూ ప్రోత్సహించలేను. చాలా ఉన్నతమైన ఆశయాలతో చేసుకున్న వివాహాలు కొన్ని విఫలం అవవచ్చు. దాన్ని యేవిధంగాను మనం ఆపలేము. ఉన్నత భావాలు, ఆశయాలు కలిగిన సమర్థుడైన సవర్ణ హిందూ యువకుని, విద్యావతియైన హరిజన బాలిక వివాహం చేసుకుంటే తప్పకుండా రెండుపక్షాలవారికి యీ దంపతుల వల్ల నిజమైన సేవ లభిస్తుంది. ఆ హరిజన బాలికకే ఆశక్తి, సేవా తత్పరతవుంటే, హరిజన యువతులందరికీకూడా ఆదర్శయువతి అవుతుంది. ఈ ఆదర్శ దంపతులకు కలిగిన సంతానంకూడా వారికి తగినవారవుతే హరిజనోద్ధరణ యింకా కొంచెం ముందుకు సాగుతుంది. అప్పుడు సంఘం యీ వివాహాలుచూసి అలజడి పొందటంకూడా తగ్గుతుంది. ఇవన్నీ నెమ్మదిగా జరగాలి, కొంత కాలం పడుతుంది. సంఘాచారాలలోగాని దేశంలోగాని కొత్తమార్పు తీసుకురావాలంటే అలజడి తప్పదు, ఆలస్యం అంతకన్నా తప్పదు. కనక తొందరపడి లాభంలేదు.

సవర్ణ హిందూ యువతులు హరిజన యువకులను వివాహం చేసుకోటం అనేది ఆశించవలసిన విషయమే. అయితే రెంటింటిలో యిదే మంచిదనిమాత్రం నేను చెప్పలేను. యువతి తన కంటె తక్కువజాతివానిని భర్తగా యెన్నుకోవాలన్నదానిలో స్త్రీలు సహజంగా పురుషులతో సమాన స్థాయిలోనివారు కాదన్న లోకోక్తికి చోటిచ్చినట్లవుతుంది. ఈ చిన్నతనంగా వూహించుకోడం (inferiority complex) ప్రస్తుతం చాలావుందని నాకు తెలుసు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి సవర్ణ హిందూ బాలికలు హరిజన యువకులను వివాహం చేసుకోటమే మంచిదంటాను. అది నా చేతిలోవున్న పని అయితే, నాకు పలుకుబడివున్నంతవరకు ప్రతి సవర్ణ హిందూ బాలికనూ హరిజనుని వివాహం చేసుకోమని ప్రోత్సహించేవాడిని. అయితే యిది చాలా కష్టమైనపని. తరతరాలనుంచి ఒకళ్ల యందు ఒకళ్లకున్న అయిష్టత యిప్పుడు ఒక్కమాటు పోవాలంటే సాధ్యంకాదు. నెమ్మదిమీద ఓర్పుతో పోగొట్టుకోవాలి. ముఖ్యంగా యీ విధమైన వివాహాలవల్ల, దంపతులిద్దరిలో సేవాసక్తి యెంతవరకు వృద్ధిపొందింది, యెంతవరకు వారిద్దరివల్ల సంఘం లాభం పొందుతుంది అన్న విషయాలు చూడవలసినవి.

క్రమేపీ యీ వివాహాలు సంఘంలో పాతుకుపోయిన దురాచారాలను, నీచదృష్టిని నిర్మూ

లించేందుకు సహాయపడతాయి. తుదకు సంఘాని కంతా ఒకటే కులము యేర్పడుతుంది. ఆ కులము పేరే 'భంగీ'. ఆ పేరులో యెంత సౌందర్యం యిమిడివుంది! మాలిన్యాన్ని నిర్మూలించి సంస్కరణకు తావిచ్చేదే 'భంగీ' వృత్తి. ఈ పరిణామంకోసం మనం భగవత్సహాయాన్ని అర్థించాలి. నా కోరిక యేదిగాని వెల్లడించినంతమాత్రాన క్రియారూపం దాల్చలేదు. ఇంతవరకు, నేను ఒక్క హరిజన బాలికనైనా సవర్ణ హిందూకిచ్చి వివాహం చెయ్యలేకపోయాను. ఒక సవర్ణ హిందూ బాలికమాత్రం తన తండ్రికోరిక, యెన్నికప్రకారం హరిజన యువకుని చేసుకునేందుకు యిష్టపడింది. ప్రస్తుతం ఆ యువకుడు సేవాగ్రాంలో శిక్షణను పొందుతున్నాడు. కొద్ది రోజులలో యీ వివాహం భగవానుని దయ వల్ల జరుగుతుంది.



ఈ మధ్య ఫ్రాన్సులోని లమన్సు నగరంలో ఒక వింత కొరత సంభవించిదట. డాక్టర్ల కొరత. ఇది నిజమైనకొరత కాకపోయిన, తమకు పెట్రోలు, మోటారు టైర్లు రేషన్లు హెచ్చుచేయ లేదన్న కారణాని, నగరంలోని వైద్యులంతా సమ్మె చేశారట. ఇందువల్ల రోగుల చికిత్సతో పాటు వివాహాలన్నీ కూడా నిలిచిపోయాయి. ఆ ప్రాంతాలలో వివాహానికి ముందు దంపతులిద్దరూ ఆరోగ్యవంతులని డాక్టర్ల సర్టిఫికెటు లేనిదే వివాహం జరగదు.

* * * *

అమెరికావారు ఒక కొత్తరకపు రేడియో కనిపెట్టారట. ఈ రేడియో మామూలు వాటిలాగ కార్యక్రమాలు వినిపించటమే కాకుండా, వాటిలో మనకి కావలసినవాటిని అవి జరుగుతుండగానే రికార్డు చేసుకోవచ్చును. ఆ రికార్డును మన ఇష్టం వచ్చినప్పుడు తిరిగి వినవచ్చును ఎన్నిసార్లేనా. దీనికితోడు ఆ యంత్రానికే ఒక మాట్లాడే మైక్రోఫోను కూడా అమర్చి, మన మాటలను పాటలను మనమే రేడియోద్వారా వినవచ్చునట.

* * * *



7 గురు పిల్లలతో స్థాపించిన సంఘం నెలేనా పూర్తి కాలేదు గాని 25 మంది అయేము. ఒక ఇంట్లో ఇద్దరుగాని ముగ్గురుగాని దీనికి సభ్యులుగా చేరినచో ఒకరు అర్థ రూపాయి, మిగిలినవారు పావలా చందా ఇవ్వాలని నియమించుకున్నాం. ఎందు కంటే అందరం ఆ తల్లి దండ్రుల దగ్గరనుంచే తేవాలిగా మరి; ఇంతే గాక కొంతమంది మమ్ములను ప్రోత్సాహపరచి మాకు కొన్ని విరాళాలిచ్చేరు. మొత్తం రూ. 15/- వసూలైంది.

మా సంఘానికి ఈ నెలకు భారతి, ఆంధ్రమహిళ, బాల, సూర్యప్రభ, ఢంకా మాస పత్రికలు 'Orient', 'Bombay Chronicle', ఇంగ్లీషు వార పత్రికలు 'ఆంధ్ర పత్రిక' దిన పత్రిక కొన్నాము.

మా వూళ్లో పెద్దలు సహకారం యిచ్చి వారి కర్తవ్యం నెరవేరుస్తే, యీ చిన్న సంఘమే ఒక సంవత్సరంలో శాఖోపశాఖలుగా వృద్ధి పొంది మహిళాభ్యుదయానికి తోడ్పడుతుంది.

—యస్. కామేశ్వరి.

## ఉత్కళము నేలు ఆంధ్ర నారికి సన్మానము

30-6-46 తేదీని బ్రహ్మపుర ఆంధ్ర మహిళా సమాజము వారు శ్రీమతి ఆదుర్తి లక్ష్మీబాయి ఎం. ఎల్. ఏ. (డిప్యూటీ స్పీకరు, ఒరిస్సా లెజిస్లేటివు ఎసెంబ్లీ) గారిని సన్మానించుటకుగాను సభను జరిపిరి.

ప్రార్థన గీతములతో సభ ప్రారంభింపబడెను. పిదప, కార్యదర్శిని శ్రీమతి బోడపాటి అలిమేలమ్మగారు శ్రీమతి లక్ష్మీబాయిగారిని సభ్యులకు పరిచయము చేసి ఆమె కాంగ్రెసు ద్వారా చేసిన సంఘ సేవను మిక్కిలి కొనియాడుచు వినతి పత్రమును సమర్పించిరి.

శ్రీమతి లక్ష్మీబాయిగారు కృతజ్ఞతను తెలుపుచూ, స్త్రీ అభ్యుదయముకొరకు, తమ శాయశక్తుల పాటుపడెదమనిన్ని సంఘ సభ్యులు ఇతోధికముగా కృషిచేసి నిర్మాణ కార్యక్రమమును అమలులో పెట్టవలసి యున్నదనిన్ని ఉపన్యసించుచు సమాజమునకు ౬0 రూపాయిలు దయతో నొసంగిరి.

పిదప సమాజ బాలికలు "స్వయంవరము" అను నాటికను, మంచి హాస్యరసముగ ప్రదర్శించిరి. సమాజములోనే అభ్యసించిన బాలికలు చక్కని భరతనాట్యమును చేసి, సభికుల నానందపరచిరి.

జంత్ర వాద్య గానములతోడను, జాతీయ మంగళ గానములతోడను సభ ముగింపబడెను.

## సంఘ సంస్కరణ—ప్రభుత్వ బాధ్యత

విశాఖపట్టణము జిల్లా కళావంతుల (ఆదిబలిజ) సంఘ సంస్కరణ మహాసభవారు ఈ మధ్య ఆరోగ్యశాఖ మంత్రి శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారిని సందర్శించి రాష్ట్రములో పడుపు వృత్తిని నిర్మూలించుటకు కొక చట్టమును చేయింప వలయునని విన్నవించిరి. సంఘ కార్యదర్శిని శ్రీమతి మద్దుల రాజేశ్వరమ్మగారు కళావంతుల సంఘ సంస్కరణమునకు తోడ్పడవలయునని ఒక వినతిపత్రమును సమర్పించిరి.

జిల్లా మహాసభలో ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగ అంగీకరింపబడినవి.

౧. మన రాజధాని మంత్రివర్గమునందు డా. ఆచంట రుక్మిణీలక్ష్మీపతిగారిని ఒక మంత్రిగా ఏర్పరచినందుకు ప్రధాన మంత్రిగారిని సభవారభినందించుచున్నారు.

౨. ఈ రాజధానిలోని ప్రతి పట్టణమునందును వ్యభిచార వృత్తిచే నివసించే వారి పిల్లల నిమిత్త మొక శరణాలయమును ఏర్పరచి జాత్యాభివృద్ధికి తోడ్పడవలయుననియు, ఈ జాతిని అన్ని విధముల అవినీతికి పాల్పడ జేసిన వ్యభిచార వృత్తిని నిర్మూలించుటకై వెంటనే ఒక బిల్లును ప్యాసు చేసి ఈ సంఘోద్ధరణకు తోడ్పడగలందులకు మద్రాసు మంత్రి వర్గము నీ సభవారు కోరుచున్నారు.

౩. ఈ సంఘమునందలి బాలికలకు విధిగా వివాహములను చేయుటకును, మేళములను మాన్పించుటకును శాసనముల నేర్పాటు చేయించవలయునని ప్రభుత్వము వారిని సభవారు కోరుచున్నారు.

## సమాజసేవకు తోడ్పడిన కళాకౌశల్యము

బాపట్లలో స్థాపింపబడిన సరస్వతీ మెమోరియల్ గరల్సు హైస్కూలు సహాయార్థము ఆ స్కూలు ప్రాత విద్యార్థినులు, స్కూలులో పని చేయు స్త్రీ అధ్యాపకులు, ప్రస్తుత విద్యార్థినులు కొందరు కలసి జూన్ 29 తేదీ సాయంకాలము రాధాకృష్ణ నాటకమును ప్రదర్శించిరి. నాటకము స్కూలు

ఆవరణములోని క్వాడ్రాంగిలులో చక్కగ అలంకరింపబడిన ఆధునిక అవనికల మధ్య ఆడ బడినది. అవనికలు ధవళ వస్త్రములు వాటి మధ్య క్రోటన్సు తొట్లు. ఈ క్రొత్త రకపు యేర్పాటు నూత్న శోభాయుతముగ నుండుటే గాక ఆధునిక నాటకరంగమును ఎంత సులువుగ యేర్పాటు చేయ వచ్చునో కూడ తేట తెల్లమైనది.

శ్రీకృష్ణ పాత్రను కుమారీ వైదేహి (ఆంధ్రా యూనివర్సిటీలో ఎకనమిక్సు సెకండు ఆనర్సు చదువు విద్యార్థిని) నటించిరి. నిత్య జీవితములో యేలాటి హోదాతో విద్యార్థులు వ్యవహరింతురో అలాగే స్టేజిమీద కూడ పాత్ర పోషణ జేసిరి.

సత్యభామ పాత్రను కుమారీ సీతాలక్ష్మి నటించిరి. ఈమె అగ్రికల్చరు కాలేజీలో 2-వ సంవత్సరమునందు చదువు చున్నది. సత్యభామ పాత్ర పోషణలో యీమె సహజ గర్వము, ఈర్ష్య, స్వాభిమానములను చక్కగా ప్రతిబింబించు లాగున నటనా చాతుర్యమును ప్రదర్శించిరి. సహజముగ యీమె సిగ్గరి, మిత భాషిణి. కాని స్టేజిమీద చాల చురుకుగాను, సులువుగాను, ఉత్తేజకరముగను నటించి ప్రేక్షకులమన్న నలబడయ గలిగెను.

రాధ పాత్రను శ్రీమతి వరలక్ష్మమ్మగారు పై స్కూలులో సంగీతము నేర్పు ఉపాధ్యాయిని చాల నేర్పుతో పాత్రను పోషించి సర్వతోముఖ అభినందనముల బడయగలిగిరి.

వసంతకుని పాత్రను శ్రీమతి శివరాజు తిలకమ్మగారు— స్కూలులో టీచరు, చాల నిపుణతతోను, రసికతతో నిర్వహించి ప్రేక్షకుల నానందింప జేసిరి.

తక్కిన పాత్రల నన్నిటిని స్కూలులో చదువు విద్యార్థినులు కుమారి యస్. రుక్మిణి, రాధ, అ. సుబ్బమ్మ. కె. లక్ష్మిదేవి తగురీతిని నటించి మొత్తము మీద మంచి 'టీము స్పిరిటును' చూపగలిగిరి. ఈ సందర్భములో స్కూలు మానేజరు శ్రీమతి భీమరాజు వరలక్ష్మమ్మగారు యీ నాటకమును డైరెక్టు చేయుటలో గల శక్తియే నాటకము యొక్క జయప్రద ప్రదర్శనమునకు కారణమని చెప్పవచ్చును. బయటి వారి సహాయము లేకయే నాటకమును తమలో తాము శిక్షణ చేసుకొని మామూలు స్టేజిమీద ప్రదర్శింపబడు నాటకమునకు సరితూగునటుల ప్రదర్శించిరని చెప్పిన అతిశయోక్తి కానేరదు.

ఈ సందర్భములో యీ స్కూలు విషయం రెండు ముక్కలు వ్రాసిన సమంజసమే యగును. బాపట్లలో సుప్రసిద్ధ న్యాయవాదులు శ్రీ వెలగపూడి సుబ్బారావుగారి సతీమణి కీ. శే. వెలగపూడి సరస్వతమ్మగారు 1930 ప్రాంతాలలో యువతీ విద్యానిలయము అను పేర ఒక హయ్యరు ఎలిమెంటరీ స్కూలును బాలికల కొరకు స్థాపించిరి. తర్వాత కొద్ది సంవత్సరములకు దానితో బాటు హయ్యరు గ్రేడు ట్రయినింగు స్కూలునుకూడ నడప మొదలిడిరి. ఈ స్కూలు నుండి తయారైన ఉపాధ్యాయినులు కొన్ని వందల మంది ఉపాధ్యాయినిలుగ పని చేయుచున్నారు. 1942 ప్రాంతములో ట్రెయినింగు స్కూలును మరొకరి కొసగి గరల్సు మిడిల్ స్కూలుగ నడప మొదలిడిరి. శ్రీమతి సరస్వతమ్మగారు 1943లో ఆకస్మికముగ అకాల మృత్యువు వాత బడిరి. తదాదిగ ఆమె ప్రథమ పుత్రిక శ్రీమతి భీమరాజువరలక్ష్మమ్మగారు స్కూలు మేనేజిమెంటు నిర్వహించుచున్నారు. నిరుడు ఫోర్తుఫారం యీ సంవత్సరము ఫిఫ్తుఫారము నడుపుచున్నారు. వచ్చే సంవత్సరము స్కూలుఫైనలు పెట్టి హైస్కూలును పరిపూర్ణ స్థితిలోనికి తెచ్చెదరు. 200 లకు పైగా విద్య నభ్యసించుచున్నారు. శ్రీ వెలగపూడి సుబ్బారావు పంతులుగారు యీ స్కూలు కొరకు షుమారు 30 వేల రూప్యములు వ్యయము చేసినారు. ఈ వత్సరము షుమారు 20 వేల విలువగల భవనములను స్కూలునకు దానము చేసి యున్నారు. ఒక వ్యక్తిచే నడుపబడుచున్న యీ విద్యా సంస్థను మద్రాసు ప్రభుత్వమువారు, ప్రజలు వారి ధర్మమును నిర్వర్తించి సుమారు 20 సంవత్సరములుగ నడపబడుచున్న సంస్థను చిరస్థాయి చేయుదురు గాక. శ్రీమతి సరస్వతమ్మగారి మరణానంతరము స్కూలును సరస్వతీ మెమోరియల్ గరల్సు హైస్కూలు అను పేరుతో నడప బడుచున్నది.



# సంగీత పరీక్ష

✻ శ్రీ కవికొండల వేంకటరావుగారు ✻

శ్రీనివాసరావు ఇంజనీరు (బి. ఇ.) పరీక్షలో కృతార్థుడైతేనే గాని పెళ్లి చేసికోనని బింకం పట్టుక్కూర్చొన్నాడు చాలాకాలం. కాని ఈ బింకం పట్టిబింకమేనని చాలామందికి తెలుసు. ఆ కారణంవల్ల పెళ్లికి ఆడపిల్లలున్న వాళ్లందఱూ ఎప్పుడో ఒకప్పుడు శ్రీనివాసరావుని ఆహ్వానం చేసి తమ అభిప్రాయం వెల్లడి చేస్తూవచ్చారు. విఫలులూ అయ్యారు. క్రమంగా శ్రీనివాసరావు ఊహాలు వర్ణనాతీతాలు అయిపోయి, కోరికలు గొంతెమ్మ కోరికలు అయినయ్. మరెవ్వరూ అతణ్ణి పిల్చి పిల్లనిస్తాం అనే వాళ్లు లేకపోయారు. శ్రీనివాసరావు చదువు పూర్తి అయినప్పట్నుంచి అస్తమానం సంగీత పరిశ్రమ చేసేవాడు. ఎక్కడన్నా జలపాతం చూచాడో అందలి విద్యుత్ప్రభావం ఎంత తెలిసికోగలిగేవాడో అందలి లయజ్ఞానం అంత అలవఱచుకునే వాడు. గొప్ప మేధావి గొప్ప పరిశోధకుడూకూడాను శ్రీనివాసరావు.

చెప్పన్న దేశాల కన్నెపిల్లల్లోనూ వొప్పైనది, వన్నెచిన్నెలుగలది, వొయ్యార మొలకించేదీని "కీర". "కీర" కీర్తి ఎలాగో శ్రీనివాసరావు చెవిని బడింది. పిల్లకు సంగీతము వచ్చా అనే అతగాడి యక్షప్రశ్న! తతిమ్మా పరీక్ష లనవసరం అని కూడా అతగాడి మతం. పిల్లకు పెళ్లికొడుకెలావుంటాడో చూదామనే భ్రమ, గొంతు కెల్లావున్నా సరే!

ఒక చోట పెళ్లికాని ఆడపిల్ల, మరోచోట పెళ్లికాని మగపిల్లవాడూ అంటూవుంటే, ఎల్లాగైనా వాళ్లిద్దఱూ అన్యోన్యం చూచుకోక మానరు. ఎంత జరగదన్నా! ఎంత బ్రహ్మ విరుద్ధభావంతో ఉన్నా!



"కీర" అపురూపంగా పాడేస్తూవుంది. పాటతో సరిసమానంగా వాయులీను మీద కమాను యీడుస్తూ వుంది. ఎలావుంది పిల్ల? ఎత్తికుదీస్తే ఎగిరి తూలేలాగుంది! శ్రీనివాసరావు ఎక్కడన్నా లయ తప్పుతుందా పట్టుకుందాం అనే విమర్శనా దృష్టి.

విడిచి పెట్టకుండా, పెళ్లికొడుకు చూపులు చూస్తూవున్నాడు. తన చేతులతో తాళం వేస్తూ తల వూపుతూ "బలే! బాగు! బళా!" అని హెచ్చరిస్తూవున్నాడు. "కీర" అపురూపంగా కేలూ కమానూ ఎంత దూరంలాగేసిందంటే వోతూరి, నే చెప్పలేను! కొండనుండి చెట్టుశాఖ సాగి సాలిపురుగును గెంతించినట్లు మెఱయించిందను కొండి కమాన్నూ కేల్నూ, కేల్నూ కమాన్నూ పక్షోజయుగళి నిలుకడనే!

అంత బాగా పెళ్లికూతురు వాయిస్తూ పాడుతూవుంటే శ్రీనివాసరావు "ఛెస్సి తగలేశావ్! బంగారంలాంటి కృతి! తాళం తప్పింది! తప్పిందే! ఛెస్సి' తాళం తప్పిందే!" అని కేకేశాడు. "కీర" వెంటనే ఫిడేలు అక్కడ పడేసి "ఏమయ్యో! పెళ్లి కాకుండానే హాములు చేస్తున్నావు!" అంది పయ్యంట కంట నొత్తుకు వెడవెడులేస్తూ. పెళ్లికూతురు తల్లి "చూపులు చూపులే, సంగీతం సంగీతమే! చూపుల కొచ్చి పరీచ్ఛలేమిటి? ఆమాత్రం స్వతంత్రం లేకపోతే అమ్మకడుపున బుట్టి బ్రదికేదెట్లా? అస్తమానం పెళ్లికాని ముందప్పట్నుంచీకూడా మగాడితో లయకలిపి పాడాలీ అంటే చావుకాదూ ఆడదానికి!" అని రంయిమంది. "పెళ్లయాక మట్టుకు?" అని గంయిమంది కీర పెద్దప్పగోరు. కీర తండ్రి "పెళ్లయ్యాక పప్పపా చావ్చాచో వేయిలాంటి వాళ్లకు" అన్నాడు శ్రీనివాసరావును చూపుతూ.

శ్రీనివాసరావు సవిమర్శగా అనబోయాడు "అదేమిటండీ అలా అంటారు? నేను సరియైన లయ చూపెడతాను. ఇదిగో" అని వేయబోయాడు మళ్లీ కృతికి సరియైనతాళం తాను..... ఆపాళంగా పెళ్లికూతురు తండ్రి శ్రీనివాసరావు చెయి పట్టుకు లయ కట్టిపెట్టించి, "చూడు అబ్బాయీ! మా పిల్లకు నేను చెప్పించింది పెళ్లి సంగీతం. పెళ్లి సంగీతం అన్నది చూడాలిసిందేగాని వినవలసింది కాదు. ఫఫఫఫఫ" అన్నాడు. శ్రీనివాసరావు "వెఱ్ఱి మామా! నా మతంలో సంగీతం అన్నదెలాంటిదీ అంటే— పశుర్వేత్తి, శిశుర్వేత్తి—". కీర తండ్రి "తెఱ్ఱల్లుడా! నా మతంలో సంగీతం అంటే ఎలాంటిదీ అంటే, మగాళ్లదైతే పశువుల కోసం, ఆడాళ్లదైతే శిశువుల కోసం, రెండూ కానివాళ్లదైతే నాగుబాముల కోసం అని—"

శ్రీనివాసరావు "అతి (too much) కి పోయి సిద్ధాన్నాన్ని చెడగొట్టుకున్నానే" అని చింతించేడు.

మర్నాడు గాన సభ! "కీర" "చింతింప నేమి ఫలము" అన్న కృతి విసిరింది. శ్రీనివాసరావు సభలో మునుముందు కూర్చుని లయ వేస్తూ "అపర శారదా!" అని అభినందించాడు! కీర పాట ఆపుతూ "లయ విశారదులకు జోహారు" అంది.





# కస్తూర్బా గ్రామ సేవికా శిక్షణ కేంద్రము

గౌతమీ సత్యాగ్రహాశ్రమం :: సీతానగరం

కస్తూర్బాగాంధి దివ్యస్మృతి చిహ్నముగా సీతానగర ఆశ్రమములో గ్రామసేవికల శిక్షణ కేంద్రము నెలకొల్పబడినదని పాఠకులకు తెలిసియే యుండును. తెలుగు పల్లెలలో వుపాధ్యాయినులుగను నిర్మాణ కార్యక్రమ ప్రచారకు రాండ్రుగాను సేవ చేయుటకు వలయు శక్తి, మనోప్రవృత్తి కల్పించుటయే యీ శిక్షణ కేంద్రము యొక్క ఆదర్శము.

శిక్షణ కేంద్రమును నిర్వహించుచున్న సోదరీమణులు సీతానగర గ్రామములో పిల్లలకు ఒక బేసిక్ పాఠశాలగూడా నడుపుచున్నారు. చుట్టుపట్ల గ్రామములకుగూడ వెళ్లి నిర్మాణ కార్యక్రమమును కొనసాగిస్తున్నారు. ఈ కేంద్రమునకు శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మ, దుక్క విద్యాదేవిగారు సహాయ కార్యదర్శినులుగా సేవ చేస్తున్నారు.

ఈ కార్యక్రమము జూన్ రెండవ వారములో ప్రారంభింపబడినది. వుపాధ్యాయినీ వర్గము-ఎనమండుగురు దేశసేవికలు-జూన్ మాసాంతము వరకు ఆచరణలో పెట్టిన కార్యక్రమము, వారి అనుభవములను ముచ్చటిస్తూ వారు వ్రాసిన కార్యనివేదకలను సంగ్రహముగా ప్రకటిస్తున్నాము. వాటిని శ్రద్ధతో పరిశీలించి తమకు తోచిన సలహాలను తెలిపి ఆంధ్ర రాష్ట్రీ కస్తూర్బా సంఘము తలపెట్టిన కార్యక్రమమునకు తోడ్పడ ప్రార్థితులు.

— దుర్గాబాయి

हिन्दुस्तान की स्त्रियो के लिये आज सब से बड़ा काम है हिन्दुस्तान के गांवों की सेवा।

आशा देवी।

— ఉత్తమ గ్రామసేవికలుగా తర్ఫీదు నిచ్చే కార్యక్రమం —

# మాతృభాషా పరిజ్ఞానం, గ్రామ పారిశుద్ధ సేవ

శ్రీమతి పి. వెంకటరమణాదేవి

మొదటి రెండు మూడు దినములు కేవలము విద్యార్థినులచే ఉదయమున, సాయంకాలమున జేయు ప్రార్థనా శ్లోకములకు అర్థములను వ్రాయించితిని. దినచర్య వ్రాయు పద్ధతిని చెప్పి వ్రాయించితిని. ఆ విధముగా వారి మాతృభాషా జ్ఞానము యెంత ఉన్నది గ్రహించుటకు ప్రయత్నించి, తెలుసుకొనగలిగితిని. తరువాత వారికి, భాషాజ్ఞానము, విషయ జ్ఞానము వెనుకబడి యుండుటను గ్రహించితిని. గ్రామ సేవికలుగా తయారగు వారికి ప్రస్తుత రాజకీయ, ఆర్థిక, సామాజిక జ్ఞానము యొక్క పరిజ్ఞానము అత్యవసరము. అప్పుడు నూతన ప్రణాళిక యొక్క ఆదర్శము ప్రకారము బాల బాలికల పాఠశాలలను ప్రస్తుత పరిస్థితులకు జవాబిచ్చునట్లు తయారు చేయలేము. అందుకని ఇప్పుడు విద్యార్థినులకు విషయ జ్ఞానమే గాకుండా భాషా జ్ఞానమునుకూడ అభివృద్ధి చేయు బాధ్యత యేర్పడినది.

ప్రస్తుత ఆర్థిక, రాజకీయ జ్ఞానము కేవలము విషయములుగా గాకుండా ప్రస్తుత సాంఘిక, రాజకీయ నాయకుల జీవిత చరిత్రలను చదివించుచు, చెప్పుచు తద్వారా పై మూడు విషయముల జ్ఞానము సులభముగా బోధించవచ్చునని ఊహించితిని. మొదట ఆంధ్ర నాయకుల జీవిత చరిత్రలను ప్రారంభించితిని. ఆశ్రమములో ఉన్నప్పుడు, ఆశ్రమము యొక్కయు ఆశ్రమ సంస్థాపకుల యొక్కయు పరిచయము అత్యవసరముగాన శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారి జీవితమును, తరువాత ప్రకాశంగారి జీవితమునుకూడ చదివించితిని.

నాయకుల జీవితములతో సంబంధించిన కొన్ని యుద్యమములను—ఉప్పు సత్యాగ్రహము, హోమ్ రూలు, నిర్మాణ కార్యక్రమములను గురించిన విషయ జ్ఞానము నిచ్చితిని. ప్రతి సోమవారము వాగ్వర్థినీ సభలు పెట్టి దానిలో విద్యార్థినులకు మాట్లాడుట కవకాశ మిచ్చి సభా పిరికి తనమును వదలి వారి వక్తృత్వ శక్తిని వృద్ధి చేయించుటకు ప్రయత్నించితిని. ఆ సభలలో కేవలము విద్యార్థినులే గాకుండా ఉపాధ్యాయినులుకూడ మాట్లాడి ఏ విధముగా ఉపన్యాసములో విషయము ఎత్తుకొని ముగించవలెనో గ్రహించునట్లు చేసితిమి. రెండు వారముల వాగ్వర్థినీ సభలలో, స్త్రీ విద్య, ప్రస్తుత విద్యా విధానము మంచిదా? వార్ధావిద్యా విధానము మంచిదా? అను విషయములపై చర్చ జరిగినది. ఇవి గాకుండా అవసరమగునపుడు పరిశుభ్రత, స్త్రీలకు నర్సు (ట్రయినింగు) శిక్షణ లేక పోవుటచే కలుగుచున్న అనర్థములు ఇతర దేశములలో ఈ విషయ పరిజ్ఞానమువల్ల పొందుచున్న లాభమును గూర్చి క్లాసు తీసుకొంటిని.

నాయకుల జీవిత చరిత్రలోని రెండు చరిత్రలు చదివిన తరువాత జీవిత చరిత్రలను చదువుటవల్ల వచ్చు లాభములు అనుశ్రద్ధతో వ్యాసము వ్రాయించితిని.

### పరిశుభ్రతా శాఖ :

మొదటిలో నాలుగయిదు రోజులు వర్షము కురియుటచే పరిశుభ్రత విషయములో విశేషముగా పని చెయ్యలేక పోతిమి. తరువాత విద్యార్థినుల యొక్కయు ఉపాధ్యాయినుల యొక్కయు సహకారముతో వారి వారి వసతి గృహముల వద్ద, ఝండా వందన మైదానమువద్ద, బావివద్ద, వంట గృహ పరిసరములలోను చెత్తచెదారము లేకుండునట్లు, పాకీదొడ్లు అసహ్యముగా ఉండకుండునట్లు చూచుచుంటిని. పరిశుభ్రతకు అవసరమగు సాధన సామగ్రి లోపముచే మొదటిలో కొంత కష్టము కలిగినప్పటికి కొద్ది దినములకు కొన్ని ఉపకరణలు సమకూర్చుటచే పరిశుభ్రత సాధ్యమగు నంతవరకు బాగుగా చేయుటకే ప్రయత్నించుచున్నాను. ఇంకను విస్తృతముగా పరిశుభ్రత శాఖ కార్యక్రమమును పాటించుటకు ఉపయోగించు పెద్ద చీపుర్లు కొరవగా ఉన్నాయి. గ్రామములో పరిశుభ్రతా శాఖ కార్యక్రమము ప్రారంభించుటకు ఇంకా కొంచెము శిక్షణ కేంద్రము ఒడుదుడుకులు తీరిన తరువాత ప్రారంభించ వచ్చునని మా కార్య

కారిణీ సభ నిర్ణయముచేయుటచే ఇంత వరకు ఏమి చేయ లేక పోతిమి. ఇకముందు ఈ విషయములో తగిన ప్రయత్నము చేయగలమని ఆశించుచున్నాము.

### వ్యవసాయ శాఖ:

శ్రీమతి కృష్ణమ్మగారు అనారోగ్య కారణముచే గ్రామాంతరమున ఉండుటచే 24 వ తేదీ వరకు వ్యవసాయ శాఖను నేనే చూడవలసి వచ్చినది. ఇంత వరకు 100 గజముల భూమిని త్రవ్వి మడులు కట్టి, గోంగూర, తోటకూర గింజలు చల్లించితిమి. బెండ గింజలనుకూడ నాటించడమైనది. ఈ కార్యమంతయు గ్రామ సేవికా శిక్షణ కేంద్ర విద్యార్థినులే చేయుచుండిరి. వ్యవసాయ శాఖ హెడ్డాఫీసువారు శ్రీమతి కృష్ణమ్మగారు గ్రామమున లేని సమయమున వచ్చి చూచి వెళ్లిరి. తిరిగి రెండవ తేదీని వచ్చి స్థలమంతయు చూచి సలహాల నిచ్చెదమని విత్తనములను సప్లయి చేయుదుమని, కావలసిన సహాయము చేయుదుమని చెప్పియుండిరి. అందుచే ఇకముందు ఈ శాఖ అభివృద్ధి పొంది మా ఆశ్రమము సస్యశ్యామలమయి ఒప్పారునని ఆశించుచున్నాను.



— భావిభారత భూమికి జోహారు లర్పించే —

# జాతీయ భాష, జాతీయ సైనిక శిక్షణ

శ్రీమతి సుభద్రగారు

నేను వ్యాయామ శాఖలో ప్రతి దినము 5½ గం|| నుంచి ఆరు గంటలవరకు ఈ క్రింద విషయములు నేర్పితిని.

వచ్చిన విద్యార్థినులందరకు ఇదివరకు ఏ మాత్రము డ్రిల్లు తెలియక పోవుటవలన మొట్ట మొదటనుంచి నేర్పుచున్నాను.

एक कतार, होशियार, कदम खोल, तमाम थार, दाहिने ओर से एक से गिनती, दो से गिनती, तीन से गिनती, चार से गिनती, दाहिने रुख, बायें रुख, घूम जाओ, ताल से कदम, आहिस्ते कदम, फ्री आर्म्स

लेझीम కూడా నేర్పుచున్నాను. लेझीम లో लेझीम ले पट, होशियार, आराम, सीधी जगह, एक जगह, दो रुख, गज बेल నేర్పితిని.

ఝండా వందనము చేయుటకూడ నేర్పి రోజుకు ఒకరి వంతున వారి చేతే ఝండారోహణ చేయించుచున్నాను.

ఝండా వందనము యొక్కయు, సైనిక శిక్షణయొక్క ఆజ్ఞలను రాష్ట్ర భాషలోనే ఇచ్చుచున్నాము. కారణము ప్రస్తుతము హిందీ ఆజ్ఞనే వ్యాప్తము చేసిన మును ముందు రాష్ట్రీయ జీవితమునకు వుపయోగకరముగా నుండు నని ఆలోచించితిమి.

హిందీ:—ఇంతవరకు ఎనిమిది హిందీ క్లాసులు జరిగెను. ప్రారంభమున వారి యోగ్యత చూచిన తరువాత రెండు శాఖలుగా విభజింపబడెను. అందు ప్రాథమిక యోగ్యత మధ్యమ యోగ్యతగల విద్యార్థినులుగలరు. ప్రాథమిక క్లాసు శ్రీ సరళాదేవిగారు, మధ్యమ యోగ్యతగల విద్యార్థినుల క్లాసు నేనూ తీసుకొనుచున్నాము.

ప్రాథమిక క్లాసు విద్యార్థినులకు ప్రాథమిక యోగ్యత లేకపోవుటవలన వారికి ఇప్పుడు అక్షరములు నేర్పుచున్నారు.

మధ్యమ యోగ్యత వున్నదను కొన్న విద్యార్థినులకు ఆ యోగ్యత లేకపోవుట వలన వారికి చిన్న వాక్యములు మాట్లాడుట దూసరీకితాబ్ చదివించుచున్నాను. ఈ క్లాసులు వారమునకు మూడు జరుగుచున్నవి.



# గ్రామ సేవ ద్వారా ఉత్తమ విద్య

శ్రీమతి ఐ. కేశవమ్మగారు

14-6-46 నుండి నేను గ్రామసేవికా శిక్షణ కేంద్రము యొక్క విద్యార్థినులకు సామాన్య శాస్త్రము నేర్పుటకు ప్రారంభించితిని. ముందు రోజు గ్రామ నిరీక్షణకై వెళ్లి యుంటిమి. అప్పుడు హరిజన వాడలో సందుగొందులు అశుభ్రముగా నుండుట, మురికి కాలువలు, బావుల దగ్గర బుర్దు, పందులను యిండ్లకు సమీపముగా తిరగ నివ్వడము, యిండ్లు యిరుకుగా వుండడము గమనించితిమి. మరురోజు యిదే విషయములు తీసుకొని సామాన్య శాస్త్రము చెప్పితిని.

విషయ వివరణ :

(1) గాలి, నీరు, ఆహారము పరిశుభ్రతల యొక్క ఆవశ్యకత, రోగముల ఉత్పత్తి, రోగములనుండి సంఘమును కాపాడుట. (2) ఆహార స్వరూపము ఆహారమందు ముఖ్యాంశములు, ఆహార వర్గములు, ఉచితాహారము, ఆహార పరిశుభ్రత—దాని పచనము, మొత్తము ఈ పది హేను రోజులలో మూడు పీరియడ్సు తీసుకొంటిని.



# స్వయంపోషకమైన పరిశ్రమద్వారా విజ్ఞానం

శ్రీమతి ఆర్. సామ్రాజ్యం :: శ్రీమతి సుభద్ర

తా. 12-6-46 నుండి గ్రామసేవికా శిక్షణ కేంద్రము యొక్క తరగతులు ప్రారంభించబడినవి. రోజూ వుదయము గం॥ 8-30 నుండి 11-30 వరకు అనగా మొత్తము 3 గంటలు మూలవుద్యోగము వడుకుట విద్యార్థినులకు నేర్పించడమైనది. కాని విద్యార్థినులకు మాతృ భాషయందు యోగ్యత తక్కువగా యుండుటవలన 17-6-46 వ తారీకు నుండి 45 నిముషములు తెలుగు క్లాసు జరుగుచున్నది. యిందు వలన ప్రస్తుతము మూలవుద్యోగము వడుకు క్లాసులు రోజుకి 2-15 గం॥లు మాత్రము జరుగుచున్నది. వడుకు క్లాసు సుభద్రగారు, సామ్రాజ్యంగారు కలిసి తీసుకొనడమగు చున్నది.

క్లాసులో సగటున రోజుకి హాజరు 15. 16 రోజులకు మొత్తం 43 చిలపల 7 కట్లు 4 చుట్లు నూలు తీయడమైనది. సగటున నూలు నంబరు 10. మొత్తం కూలి రూ. 4-4-9 వచ్చినది. క్లాసులో 60 తులముల దూది విద్యార్థినుల చేత ఏకించడమైనది. ఏకుటకు కూలి రు. 0-12-0. మొత్తము క్లాసులో రు. 5-0-9 అందరు విద్యార్థినులు కలిసి సంపాదించడమైనది. సగటున అరగంటకు 47 చుట్లు గతివచ్చినది. విద్యార్థినులంతా యిక్కడ వచ్చి తకిలీ నేర్చుకొనుట ప్రారంభించిన వారే; వడుకుటయందు వారు చాల వుత్సాహమును కనపరచుచున్నారు. రాట్నములు, కమానులు వున్నచో యింకా చాల బాగుగా పని జరిగేది. కాని ప్రస్తుతము వాటి అభావము వలన కేవలము తకిలీ మాత్రమే నేర్పించుచున్నాము. పిండలీ ఆసనము మీద తకిలీ వడుకుట కూడ నేర్పించడమగుచున్నది.

## శాస్త్రీయజ్ఞానము

చిలప చుట్టుపద్ధతి, వడుకుటకు ముందు గమనించవలసిన విషయములు, బూడిద యొక్క వుపయోగము, నూలు నెంబరు తీయు మూడు పద్ధతులు చెప్పితిమి. రోజూవడికిన నూలు రికార్డు పెట్టుట, దానివలన వచ్చు లెక్కలు, పిల్లలకు ఈ మూలవుద్యోగము వడుకుట ద్వారా గణితము, భాష,

భూగోళము, దేశ చరిత్ర మొదలైనవి పిల్లలకు నేర్పించు పద్ధతి, ప్రస్తుత శిక్షా పద్ధతిలోను, క్రొత్త శిక్షా పద్ధతిలోను వున్న భేదమును చెప్పడమైనది. తకిలీ తూకము, తకిలీ దేనితో తయారయినదీ, యినుము ఎన్ని రకములుగావున్నదీ వానిలో ఎటువంటి యినుము శ్రేష్ఠమైనదీ, కాస్ట్ ఆయిరన్ స్టీల్ ఆయిరన్, రాట్ ఆయిరన్ తయారు చేయువిధము, తకిలీకి యిత్తడి బిళ్ల పెట్టినందు వలన లాభము, యిత్తడి తయారు చేయువిధము చెప్పితిమి.

## 12-6-46 నుంచి 29-6-46 వరకు మూల ఉద్యోగంలో జరిగిన పని

| సంఖ్య | పేర్లు | మొత్తం గంటలు గం. ని. | మొత్తం నూలు చి. క. చు. | 30 ని॥లకు తక్కువ గతి | 30 ని॥లకు ఎక్కువ గతి |
|---|---|---|---|---|---|
| 1 | వి. అన్నపూర్ణమ్మగారు | 21—40 | 2—0—0 | 13 | 32 |
| 2 | ఎ. స్వరాజ్యలక్ష్మిగారు | 29—10 | 3—4—0 | 18 | 55 |
| 3 | షేకనన్నీగారు | 29—15 | 3—7—31 | 38 | 54 |
| 4 | జి. సూర్యకుమారిగారు | 29— 0 | 3—3—26 | 29 | 73 |
| 5 | కె. లక్ష్మిగారు | 40— 0 | 2—10—7 | 12 | 22 |
| 6 | కె. సీతారావమ్మగారు | 32— 0 | 2—10—28 | 22 | 53 |
| 7 | టి. మణికుమారిగారు | 29— 5 | 1—4—3 | 21 | 42 |
| 8 | డి. అతిరంధగారు | 25—35 | 3—0—24 | 22 | 40 |
| 9 | బి. రాజేశ్వరమ్మగారు | 31— 0 | 1—13—2 | 15 | 38 |
| 10 | జి. మనోరమగారు | 18—29 | 1—15—17 | 35 | 53 |
| 11 | పి. అనంతలక్ష్మిగారు | 11—25 | 1—1—13 | 25 | 25 |
| 12 | వై. రాధామనోహరంగారు | 21—10 | 5—5—31 | 61 | 98 |
| 13 | వి. రుక్మిణిగారు | 54—13 | 3—2—39 | 12 | 38 |
| 14 | కె. జ్యోతీబాయిగారు | 24—45 | 2—4—35 | 31 | 37 |
| 15 | కె. ధనమ్మగారు | 32— 0 | 2—1—27 | 35 | 42 |
| 16 | కె. సుశీలాదేవిగారు | 24—50 | 2—4—5 | 32 | 55 |
| 17 | జ్ఞానప్రసూనాంబగారు | 30— 7 | 1—12—36 | 38 | 42 |
| | మొత్తం ... | 433—44 | 44—7—4 | | |



# పిల్లల పాఠశాల

## 1-వ తరగతి

శ్రీమతి కె. సరళాదేవిగారు, శ్రీమతి కె. కమలాంబగారు

మొదటి దినమున పిల్లలచే వారి భాషలోనే తరగతిలో యేమి పనులు చేయవలెనో అవి ఎంత అవసరమో, ఆ పనులను నిర్వహించే వారిని మంత్రులని పిలుస్తారనియు, వారి మాట మీరరాదనియు పరస్పర స్నేహముతో, ప్రేమతో పనులు చేయవలయుననియు నచ్చజెప్పబడెను. మంత్రి పదవికి అందరు నిలబడగా ఎన్నికలు జరిపి "ఓటు" యొక్క అర్థము తెలియ జేసితిమి.

పరిశుభ్రత :—సామాన్యంగా పిల్లల ముక్కు, నోరు, గోళ్లు అశుభ్రంగా వుండుట, నోటిలో వ్రేళ్లు వేసుకొనుట, పలకలకు వుమ్మి రాయుట తినుపదార్థాలు తెచ్చి మురికి చేసికొనుట, ఒకరి నొకరికి వుమ్మి రాచుకొనుట, బడిలోనే వుమ్మివేయుట, యిట్టి అశుభ్రమైన పనులు చూస్తూ వెంటనే చేయనిచ్చుటకు అవకాశమిచ్చి దానివలన పాఠమును నేర్పుట, దానివలన నష్టాలను, అసహ్యతను గురించి, ఆరోగ్యమంటే యేమిటో పుస్తకాల్లో "ఆరోగ్యమే మహా భాగ్యం" అని సూక్తులు ఎగిరి పోవునట్లు వల్లించుటవలన లాభము లేదనియు దాని వుదాహరణముగా తీసుకొని ఆచరణలో పెట్టవలయునని చెప్పబడెను.

వ్యక్తిగత శుభ్రతను గురించి బోధించిన తదుపరి సామూహిక శుభ్రతను గురించి చెప్పుచూ స్కూలు యెందుకు శుభ్రము చేయవలెనో దాని కారణాలు చెప్పించి మురికిని గుర్తింప జేసే భావాలు గలగించవలసి వచ్చెను. ప్రతినిత్యం 40 గజముల వైశాల్యముగల స్థలమును శుభ్రం చేయించుచున్నాను. ప్రారంభమున ఇది చేయుటకు చాల సంకోచించుచూ నుండెడి వారు. అయినను వచ్చిన వారితోనే పని విరమించక సాగించుతూ వుంటే కొన్ని దినాలకు వారే పాల్గొన సాగిరి.

భూగోళము :—సామాన్య భూగోళము నేర్పుటకు ప్రథమంగా స్కూలు ద్వారా ప్రారంభించితిని. దిగ్జ్ఞానము గోడల ద్వారా యివ్వబడెను. తూర్పున సూర్యుడు వుదయించుట పడమర అస్తమించుట, ఉత్తర, దక్షిణ పరిచయము పిల్లలను నిలబెట్టి తెలియ చెప్పుట జరిగెను.

వృత్తి విద్య:—తకిలీలు లెక్కించుట, పిల్లలను లెక్కించుట, ఏకులు లెక్కించుట నేర్పబడుచున్నది. దీని ద్వారా నోటి లెక్కలు రెండు అంకెల కూడికలు, ఒక సంఖ్యమీద కూడికలు, పిల్లలు ఎక్కువగా నుండిన తకిలీలు తక్కువగా నుండిన దీని ద్వారా తీసివేతలు ప్రారంభించితిమి.

వృత్తివిద్య ద్వారా వుదయమున సాయంత్రమున మాతృభాషాజ్ఞానము కలుగజేయుచున్నాము. తకిలీ, కదురు, దూది, ఏకు, ప్రత్తి మొదలగు చిన్న శబ్దములు, వాక్యములు ప్రారంభించినాము. వుదయమున పైకార్యక్రమము ప్రకారము పాఠ్య క్రమము జరుగును. ప్రార్థన, వుదయమున జండా వందన పర్యంతము అరగంట "వందే మాతరమ్" సరస్వతీ ప్రార్థన అభ్యాసము చేయబడుచున్నది. ప్రార్థన చేయునప్పుడు పిల్లలు కేకలు వేయుట, అరచుట, యేడ్చుట, గిల్లుకొనుట వీటిని సంస్కరించుటకై ప్రయత్నము చేయబడుచున్నది. శాంతముగా 10 నిమిషాలు కూర్చోబెట్టుట, వుచ్చారణ శుద్ధము చేయుట ప్రార్థన యొక్క ముఖ్యోద్దేశము బోధించడమైనది. వృత్తివిద్య ద్వారా పిల్లలు ఈ నెలలో సంపాదనా సూన్యులుగానే యున్నారు. 40 మంది పిల్లలోను 6 గురుమాత్రం ఈ వారంలో ముప్పాతిక చిలప తీయగలిగినారు. ఇంతకంటె యెక్కువ మందికి నేర్పుటకు అవకాశము లభించుట లేదు. ఒకరికి అభ్యాసము చేయించుతూ వుంటే 10 మంది పిల్లలు చుట్టుకుంటారు ఆ సమయమున

కొంత సమయము కూర్చొబెట్టుటలో గడచి పోవును. ఈ విధముగావారు గోలగా లేచుట నేను సర్దుట ఇదే ప్రధాన కార్యక్రమము. వడుకుట యందు కొలది మంది శ్రద్ధవహించు చున్నారు. బహుస్వల్పంగా అందరికి త్రిప్పుట నేర్వగలుగు చున్నారు. మూత్రానికి, పాఖానాకు వదలిన వెంటనే వారి వెంటనే వుండి జాగ్రత్తగా వెళ్లవలసి వచ్చుచున్నది. నూతి దగ్గరకు పరుగెత్తి తొంగి చూచేవారు, వేరేదు చెట్టు క్రిందకు వెళ్లి కాయలు కొట్టేవారు, మూడు శాఖలను సంభాళించుకొనుచున్నాను. సామాన్య విషయాలు ఇట్టి సందర్భంలో తెలియ జేయుటకు భాగీరథీ ప్రయత్నము చేయ వలసివచ్చుచున్నది. వారిని ఒక చోటకు సమ కూర్చుటలో శిక్షకుల ప్రాణాలు సగము క్రుంగి పోవు చున్నవి.

సామాన్య విషయాలు చెప్పుచూ సంతను గురించి, ఐకమత్యమును గురించి, సహకారము గురించి చెప్పుచున్నాము.

డ్రిల్లు:—సైనిక శిక్షణ ప్రతి దినము క్లాసు ప్రారంభమున స్కూలులోనే యివ్వబడుచున్నది. పిల్లలకు ప్రథమ శిక్షణ యిదే ముఖ్యము. నడచుట, నిలబడుట, కూర్చొనుట వీటియందే శ్రద్ధ వహించవలసి వచ్చుచున్నది. **एक कतार, होशियार, कदम खोल, चल दो, एक से गिनती, दो से गिनती** ప్రారంభించితిని.

హాజరు:—ప్రారంభ దశలో 10 మంది. 29వ తేదికి 37 మంది.



## 2-వ తరగతి

శ్రీమతి ఆర్. సామ్రాజ్యం

ఉదయముపూట శ్రీమతి రమణాదేవిగారున్నూ, మధ్యాహ్నముపూట నేనున్నూ 2వ తరగతి పిల్లలకు శిక్షణ యిచ్చుచున్నాము.

మధ్యాహ్నముపూట సమయ పత్రము:—

గం॥ 2 నుండి 3-30 వరకు వడుకుట
,, 3-30 నుండి 4 వరకు మాతృభాష, పాటలు
,, 4-30 నుండి 5 వరకు ఆటలు
,, 5 నుండి సెలవు

వడుకుట మూలవృత్తిగా తీసుకొని దాని ద్వారా పిల్లలకు గణితము అనగా కూడికలు, తీసివేతలు, భాగారములు, మాతృభాష తెలుగున్నూ, సమాజ శాస్త్రమున్నూ నేర్పించుచున్నాను. క్రమ శిక్షణ, అనగా సరిగా నడుచుట, కూర్చొనుట, ఒకరినొకరు తిట్టుకొనకుండా సభ్యత్వముగా మాట్లాడుకొనుట, నూలు వడుకునప్పుడు శ్రద్ధ దానియందు వుంచి మౌనముగా వుండుట మొదలైనవి నేర్పించుచున్నాను.

మొదట 2-3 రోజులు పిల్లలకు తరగతిలో సరిగా కూర్చొనుట, ఖాళీ తకిలీ త్రిప్పుట నేర్పించితిని. తరువాత ఏకులు యిచ్చి నూలు తీయించుట ప్రారంభించితిని. మొదటిలో వడుకుటయందు మనస్సువుంచి శ్రద్ధగా కూర్చొనుట పిల్లలకు నేర్పించుటకే కొన్ని రోజులు పట్టినవి. క్రమేపి పిల్లలు వుత్సాహముతో వడుకుట ప్రారంభించిరి.

సగటున ఒక రోజుకి పిల్లల హాజరు 15. తా 17-6-46 నుండి 29-6-46 వరకు అనగా 13 రోజులకు ఒక రోజుకి గంటన్నర సమయము చొప్పున మొత్తము 169 గంటలు పిల్లలకు మూలవృత్తి వడుకుట నేర్పించితిని. సగటున ఒక్కొక్క విద్యార్థి 9 గంటలు మూలవృత్తి పని చేయడమైనది. యిక్కడ ఖాళీ తకిలీ త్రిప్పిన సమయము గాక ఏకు తీసుకొని వడుకుట ప్రారంభించినప్పటి నుండియూ ఒక్కొక్క విద్యార్థి సగటున ఎన్ని గంటలు వడికినది వివరముగా యివ్వడమైనది. తరగతిలో మొత్తము నూలు 1770 చుట్లు అనగా 2 చిలపల 12 కట్లు 10 చుట్లు వడికిరి.

సగటున ఒక విద్యార్థి 98 చుట్లు నూలు తీయడమైనది. తరగతిలో గంటున్నరకు తక్కువ గతి 2 చుట్లున్నూ, ఎక్కువ గతి 56 చుట్లున్నూ వున్నది. నూలు నెంబరు 10. తూకము 10 తులములు. మొత్తము క్లాసులో వడికిన నూలుకి 4 అణాలు కూలి సంపాదించడమైనది. పిల్లలు అంతా తకిలీ యిచ్చుట ప్రారంభించి నేర్చుకొనినవారే. మొత్తము విద్యార్థినులలో ముగ్గురు మాత్రము గంటున్నరకు 40—50 చుట్లు వరకు వడుక గలుగుచున్నారు. తతిమ్మావారు ప్రారంభ దశలో వున్నారు.

స్కూలు క్రొత్తగా ప్రారంభించుట వలన క్లాసు కొరకు యింకను ఒక స్థలము నిర్ణయము కాలేదు. బోర్డుయొక్క అభావము చేత పిల్లలకు గణితము మొదలైనవి నేర్పుటకు కష్టముగా వుంటున్నది. కాని పిల్లలకు యిచ్చువద్ధి పునాది శిక్షణ కాబట్టి, ఏ వస్తువ లేకపోయినప్పటికీ స్కూలు జరుపుట యందే విశేషమున్నది.

ప్రతి రోజూ క్రొత్త పిల్లలు వచ్చుచుండుటవలన వారితో కొంత పరిచయము కలుగ జేసుకొనుటకు, మరియు వారి దురభ్యాసములను పోగొట్టి మంచి నడత నభ్యసింప జేయుటకే కొంతకాలము పట్టుచున్నది. తరగతిలో పిల్లలందరునూ సరిసమానమైన యోగ్యతకలవారు కాకపోవుటవలన ఎక్కువ వారితో తక్కువవారిని కలుపుటకు ప్రయత్నము చేయడమగుచున్నది.



## 2-వ తరగతి

శ్రీమతి పి. వెంకటరమణాదేవి

పిల్లలు ఇంత వరకు అనుభవించి యున్న జీవిత వాతావరణమునకు ఇక్కడి వాతావరణమునకు యెంతో భేదమున్నది. ఉదయము ఝండా వందనముతో ప్రారంభమయి సాయంకాలము జాతీయ సైనిక శిక్షణతోను ఆటలతోను ముగియు కార్యక్రమ మంతా జాతీయ రాష్ట్రీయ భావములతో ఓత ప్రోతమయి వారి చిరుహృదయములకు ఉత్సాహ వర్థకమగుటచే పిల్లలు శారీరక పరిశ్రమను సహించుటకు సహకారము చూపుటకు ముందంజ వేయుచున్నారు. పుస్తకములు లేని కొఱత వారి హృదయమునకు అసంతృప్తి కలిగించునదయినప్పటికి తకిలీ వారికి నూతన వస్తువుగా లభించుటచే కొంత వరకు పుస్తక వియోగమును మరపించకలిగినది. ప్రతీ ఘడియా వారి మనస్సునకు పుస్తకము మిత్రము మాదిరిగా స్ఫురిస్తూనే యుంటుంది. ఏమండీ మాష్టారు మాకు పుస్తకాలెప్పుడు కొంటారండీ? ఏమి పుస్తకాలు కొంటారండీ’ అనే వారి సమస్య వారికి మేము, మేము వారికి అపరిచితులము, క్రొత్త వారమగుటచే నొకరి నొకరు విసిగించుకొనుటకు అవకాశము గలగనివ్వలేదు. వారు మాకు మనః పూర్వకముగా సహకార మిచ్చుచున్నను చిన్నతనమునుండి వారికి అయిన అలవాట్లే ఎక్కువగా మా శక్తిని హరించుచున్నవి.

మొదటి రెండు దినములు పిల్లల చేత వారి భాషలోనే తరగతిలోనే యేమి పనులు జరగవలెనో, అవిజరుగుట యెంత అవసరమో ఆ పనులను చేయుటకు మనుష్యులెంతేయవసరమో చెప్పించితిని. ఆ పనులను చేయు వ్యక్తులను మంత్రులని పిలుస్తారని చెప్పించేను. మంత్రులను ఎన్నుకొనుటకు మన అందరి ఇష్టము ఎందుకు కావాలో చెప్పితిని. మనము "ఇష్టము" అని చెప్పడమునే "ఓటు" అందురని బోధించి, ఆ "ఓటు" నిచ్చి మంత్రులను ఎన్నుకొను పద్ధతి తెలియ జెప్పి, వారిలో ఎన్నికలు జరిపించితిని. మంత్రులను ఎన్నుకొనిన పిమ్మట వారికి ప్రతి సభ్యుడు ఇవ్వవలసిన గౌరవము బాధ్యతను గూడ తెలిపితిని.

కృషి : మిగిలిన పదనొకండు దినములలో వారిచే 79 అడుగుల పొడవు 38 అడుగుల వెడల్పుగల భూమిని త్రవ్వించితిని. త్రవ్వించునపుడు, త్రవ్వుటమీద కంటే వారు

గుంపుగా అల్లరిగా పని చేయుటయే గాకుండా కొంచెము వరుసగా నియమముగా పని చేయు ప్రవృత్తిని కలిగించుటకు యత్నించితిని. ఒకే వస్తువు కొరకు పదిమంది పోరాడుట, పెనగులాడుట, చిలిపికయ్యములను పోగొట్టి క్రమముగా సహనము, అన్యోన్య సహకారము ఐకమత్యమును వారిలో కలుగచేయుటకు యత్నించితిని. పిల్లలు బాగా కఠోరకర్ణముగా తిట్టుకొనుటకు అలవడియున్నందున వాటిని సాధ్యమగునంతవరకు తగ్గించుటకు, పోగొట్టుటకు ప్రయత్నించితిని.

పరిశుభ్రత : పిల్లలు ఎక్కువగా నోటిలో వేళ్లు పెట్టుకొనుట, పలకలకు ఉమ్మిరాయుట, పిండి వంటలు మొలలో పెట్టుకొని వచ్చి దుస్తులను చమురు చమురుగా చేసుకొనుట, ఎక్కడ పడితే అక్కడ అశుభ్రము చేయుట మొదలగు పనియు, చేతులు కాళ్లు కడుగుకొని దుస్తులతో తుడుచుకొనుట మొదలగు అశుభ్రతలకు లోబడియున్నారు. ఈ అలవాట్లు మంచివి కావనియు వీటివల్ల జబ్బులు వచ్చుననియు బోధించి పరిశుభ్రతను గుర్తింప జేయుటకు యత్నించితిని.

గణితము : త్రవ్విన భూమిని అడుగు బద్దతో కొలిపించి అడుగులు, గజములు, అంగుళాలు, చదరపుఅడుగులు, చదరపు గజములు, చదరపు అంగుళములను బోధించితిని. పిల్లలందరు త్రవ్విన భూమిని, కలుపుట 2, 3 అంకెలతో గుణించుట, భాగించుట, తీసివేయుట, సంఖ్యాస్థానములను బోధించితిని.

భూగోళము : భూమి త్రవ్వినపుడు మట్టి జిగురుగా నున్నదా? ఇసికిసిగానున్నదా? జిగురుగా ఉండే మట్టిని ఏమని పిలిచెదరు? ఇసుక కలసిన మట్టిని ఏమని పిలిచెదరు? అన్నది చెప్పితిని. ఆశ్రమములోని మట్టి ఎలా ఉన్నదో చెప్పించితిని. ఆశ్రమము యొక్క హద్దులు, దిక్కులు, సూర్యోదయము సూర్యాస్తమయ మగుదిక్కుల పేర్లు చెప్పించితిని. ఆశ్రమములోని ఇండ్లు, జనాభా వారిచే లెక్కింపించితిని.

ప్రకృతి శాస్త్రము : త్రవ్వినపుడు రకరకముల మట్టిని గుర్తించుట, వాటి పేర్లు ఉపయోగము చెప్పించి, బోధించితిని. కొన్ని పురుగులను (ఆరుద్ర పురుగు, ఏలిగిపాము) మొదలైన వాటిని గుర్తింప చేయుట, అవి ఏ ఋతువులో ఉంటాయో తెలిపితిని.

మాతృభాష : చిలకమర్తి వారి "భరత ఖండంబు చక్కని పాడి యావు" అను పద్యమును, చింతాదీక్షితులు గారి గీతామంజరిలోని "మా అమ్మ" అను శీర్షికలోని రెండు పద్యములను శృతి జ్ఞానమువల్ల కంఠస్థమగునట్లు చేసి, వచ్చిన తరువాత నోటుబుక్కుల మీద వ్రాయించితిని. వాటి అర్థముకూడ చిన్న భాషలో బోధించితిని. ఉదయము నుండి జరుగు దినచర్యను వ్రాయించి అక్షర తప్పులను దిద్దుచుంటిని; నలుగురి ఎదుట లేచి మాట్లాడుటను అలవాటు చేయుటకై వారి చేత తమతమ దినచర్యలను క్రమము తప్పకుండా చెప్పించి వక్తృత్వమును అలవరుచుటకు యత్నించుచున్నాను.

సైనిక శిక్షణ : ఝండా వందన సమయములో ఆజ్ఞలను అర్థము చేసుకొని, అనుసరించుటకై, ఝండా వందన సమయములో వారు ఎట్లు నిలుచున్నది, పాడినది పరిశీలించి ఝండా వందనానంతరము వెంటనే అదే విషయమును రోజు బోధించుచు ఆ నియమములు మనస్సునకు పట్టించుటకు యత్నించుచున్నాను. ఇప్పటికి పిల్లలు ఈ దిగువ ఆజ్ఞలను అర్థము చేసుకొని పాలించ కలుగుచున్నారు.

१. एक कतार, २. माप लो, ३. कदम खोल, ४. होशियार, ५. तमाम, ६. थाट, ७. एक से गिनती, ८. दो से गिनती, ९. तीन से गिनती, १०. चार से गिनती, ११. दो कतार, १२. दायाँ रुख, १३. बायाँ रुख, १४. नमस्ते ।



# 3-వ తరగతి

శ్రీమతి ఐ. కేశవమ్మగారు

ఇంత వరకు స్కూలులో చేరిన బాలబాలికలందరు సవర్ణులు, మధ్య తరగతి కుటుంబాల కలవడినవారు, బోర్డు స్కూల్, మిషనరీ స్కూళ్లలోని చదువులకు అలవడిన వారు. పరిశ్రమ చేయుటకు ఏ విధముగాను యిష్టపడనివారు. పుస్తకములు లేకుండ పని ద్వారా వారికి శిక్షణ యివ్వా లంటే వారము పది రోజుల వరకు ఒక విధముగా వారి ప్రవృత్తులను బంధించినట్లే అయినది. కాని వారికి మేము, మాకు వారు క్రొత్త వారగుటచే మేమిద్దరము యీ క్రొత్త వాతావరణమునకు విసుగక సహించితిమి. వారి మనస్సులకు పుస్తకము లేకుండా చదువవలెనంటే తోచక అయోమయము గానే వున్నది. కాని తకిలీ క్రొత్తదగుటచే పుస్తకమంత బాధించే స్నేహితుడు కాలేదు. ఇక్కడ వారికి త్రవ్వుట, తోట పని చేయుట శారీరకముగా కష్టమైనప్పటికి యింత వరకు వున్న వాతావరణమునకు యిక్కడున్న వాతావరణము నకు ఎంతో మార్పుయుండుటచేయిక్కడి జండా వందనము, జాతీయ గీతములు, జాతియ సైనిక శిక్షణ అన్నియూ ఆ బాల హృదయములను ఆకర్షించినవగుటచే వారు కొంత వరకు విసిగించి నప్పటికి అంత యెక్కువ బాధించ లేదనే చెప్పాలి.

వారు మేము చెప్పినట్లు విని ప్రతి పనిలోను సహకారు లగు చున్నప్పటికి వారికి అయిన అలవాట్లను దిద్దుటకు మాకు ఎక్కువ పరిశ్రమను కలిగించుచున్నవి. ఒకరి పై నొకరికి ప్రేమ, ఐకమత్యములేక తిట్టుకొనుట, ఒకరి పై ఒకరు చాడీలు చెప్పుట, నిమ్న జాతుల వారిని ఉన్నత జాతులు పేరులు పెట్టి నీచముగా పిలుచుట వీటిని మాన్పుట యందు ఎక్కువ కృషి చేయవలసి వచ్చినది.

మొదట్లో పిల్లలచేత వారి భావములోనే తరగతిలో జరగ వలసిన పనులను గూర్చి చెప్పించుట, ఆ పనులను చేయు టకు, ఉత్సాహం కల్గునట్లు వారి హృదయముల తయారు చేయుట, ఆ పనులను చేయుటకు వ్యక్తులెంత అవసరమో చెప్పించి, వారి మంత్రి పదవులను, ప్రస్తుత కాంగ్రెసు మంత్రి పదవులతో పోల్చి చెప్పుట, ఓటు యొక్కయు, ఎన్నికల యొక్కయు ప్రాముఖ్యతను తెల్పుట, ఎన్నికల జరిపి మంత్రుల నిర్ణయించి వారి బాధ్యతల తెల్పుట, కడి కించి తక్తా తయారు చేయించుటను నేర్పితిని.

వ్యవసాయ శాఖ :—వృత్తి విద్యను రెండు విధము లుగా విభజించి ఉదయమున వ్యవసాయము, మధ్యాహ్నము రాట్న పరిశ్రమ నేర్పుచున్నాను. మొత్తము 41 అడుగుల పొడవు 29 అడుగుల వెడల్పు గల భూమిని త్రవ్వించి 21 అడుగుల పొడవు 17 అడుగుల వెడల్పుగల భూభాగములో 9 కాల్వలు చేయించి 180 వెండ విత్తనములను నాటించి తిని. మొక్కలను పశువులు తినకుండుటకై చుట్టు దడికట్టు పనిని ప్రారంభించి యున్నారు. ఉదయమున వ్యవసాయ మును మూల ఉద్యోగముగ తీసుకొని త్రవ్విన భూమి యొక్క కొలతను బట్టి వైశాల్యము కనిపెట్టడము, అంగుళ ములను, గజములలోకి, గజములను అంగుళములలోకి, మార్చ డము నేర్పితిని. వీటిని పిల్లల మనస్సుకు పట్టునట్లు మరి మరి బోధించితిని.

సామాజిక విజ్ఞానము :—వడుకుట నేయుట వృత్తి అయినట్లే యింకా గ్రామములో నుండు వివిధ వృత్తులను పరిచయము చేయుచు సిలబస్సు నేర్పితిని.

భూగోళము :—క్రియాత్మకంగా చేసిన వ్యవసాయ మును సమన్వయపరచుచూ నేలను పదును చేయుట, తోట పాదు చేయుట దాని అవసరముల గూర్చి ప్రకృతి శాస్త్ర జ్ఞానమును, మొక్కలకు నీటి ఆవశ్యకతను గూర్చి చెప్పుచూ తమ సమీప మందున్న నది పేరడుగుచూ, హిందూదేశ మందున్న నదుల పేర్లు వాని పుట్టుక అవి ప్రవహించు ప్రదేశముల గూర్చి పరిచయమిచ్చి భూగోళము నేర్పితిని.

రాట్న పరిశ్రమ శాఖ :—నూత్ర యజ్ఞముతో కల్సు కొని 14 వ తేదీ నుండి 20 వ తేదీ వరకు ఒక గంటయు,

21 వ తేదీ నుండి 28 వ తేదీ వరకు 1½ గంటయు వడుకు పని చేయించితిని. వడుకునప్పుడు కూర్చొను పద్ధతి, తకిలీ త్రిప్పుట, ఏకులు పట్టుకొను విధానము, తకిలీ నేలమీద త్రిప్పిన కలుగు నష్టములు, దారము తీయు నప్పుడు తరగతి పిల్లలందరు ఒకే నంబరు వచ్చునట్లు వడకమని బోధించుట, పురి, సమానత యొక్క ఆవశ్యకత, 40 పోగుల ప్రకారం పాటీలు కట్టించుట మొదలైన వానిపై శాస్త్ర జ్ఞానమిచ్చితిని. చిలప చుట్టు విధానమును చేసి చూపితిని.

మాతృభాష :—పిల్లలచే దినచర్య వ్రాయించి తప్పులు దిద్ది కర్త, కర్మ, క్రియల సామాన్యజ్ఞాన మిచ్చితిని.

చరిత్ర :—చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిచే వ్రాయబడిన మహాపురుషుల జీవిత చరిత్రములోని "రాజా రామమోహనరాయలు" జీవితమును చదివి వినిపించి, అప్పటి వారి కాల మందున్న దేశ పరిస్థితుల చెప్పితిని.

పరిశుభ్రత :—మంత్రుల ఎన్నికలలో పరిశుభ్రత మంత్రిని ఏర్పరచి, ఆ మంత్రి యొక్క బాధ్యతను చూపించి తరగతి గది శుభ్రముగా వుండవలెననియు, చుట్టు ప్రక్కల కూడ పరిశుభ్రత ఆవశ్యకత గూర్చి, పిల్లల శుభ్రతను గూర్చి చెప్పితిని.

సాయంత్రం 4-15 గంటల నుండి 5 గంటల వరకు 3వ తరగతికి సుభద్రాదేవిగారు జాతీయ భాష హిందీ నేర్పుచున్నారు. 5 గంటల తర్వాత డ్రిల్లు, ఆటలు నేర్పుచున్నారు. విద్యాదేవిగారు రోజూ సంగీతము తీసుకొంటూ యింతవరకు రెండు జాతీయ గీతములు (1. వందేమాతరం, 2. ఝండా ఊంచా రహే హమారా) నేర్పిరి.





పునాది విద్యావిధాన నిర్మాతలు
ఆర్యనాయకం, ఆషాదేవి



ఠక్కర్ బాపా
కస్తూర్బా స్మారక సంఘ కార్యదర్శి

# పల్లెటూరి సంబంధం

 శ్రీ కొడవటిగంటి కుటుంబరావు 

"ఏమిటి, నాన్నా? నా కక్కర్లేదు, నాన్నా! నే నసలు పెళ్లే చేసుకోనట్లా అయితే!" అంటూ సీత చిందులు తొక్కింది.

చిన్నప్పట్నుంచీ పట్నంలో పెరిగింది. పట్నవాసం మరిగింది. స్కూలు ఫైనలుదాకా చదువుకున్నది. సినిమాలూ, నాటకాలూ, పాట కచేరీలూ, బీచి షికార్లూ, పిక్నిక్కులూ, నవలలూ, కథలూ, పత్రికలూ, రేడియోవగైరాలతో జీవితం ఉల్లాసంగా గడిచిపోయింది. భగవంతుడిచ్చిన అందచందాలకే నలుగురు మురుస్తుంటే, దానితో సంతృప్తిపడక శరీర సౌందర్యాన్ని పలువిధాల పోషించుకుంటూ ఎంతో ప్రావీణ్యతతో అలంకరించుకుంటూ ఉండేది. వెనకటి సత్యభామకు ఏడు వారాల నొమ్ములే ఉండేవి, కాని సీతమ్మ తల్లికి పాతిక రకాల గాజులూ, పాతిక రకాల చీరలూ వగైరా ఉన్నై.

సీతమ్మ తల్లికి రహస్యాలోచనలు చాలా ఉన్నై. తనకు పెళ్లయితే భార్యా భర్త లిద్దరూ ఒక్క క్షణం ఒకళ్లనొకళ్లు విడవకుండా అస్తమానమూ తిరగాలి, కలిసి భోంచెయ్యాలి. కలిసి షికారు వెళ్లాలి, కలిసి సినిమాకెళ్లాలి. ఇద్దరికీ ఏ కారణం చేతా క్షణం ఎడబాటు రాకూడదు. ఒకరి కొకరు చీమ తల కాయంత తప్పు చేసుకోకూడదు. ఇద్దరి మధ్యా చీమ తల కాయంత పొరపు రాకూడదు. భర్తలో ఉండే సౌందర్య తృష్ణ యావత్తూ తానే తీర్చాలి. తమ ఇద్దర్నీ చూసి అందరు దంపతులూ ఆశ్చర్యపడాలి...బిడ్డల్ని కనరాదు. ఎప్పుడో—చాలా ఏళ్లకు—అప్పుడు చూసుకో వచ్చు...వొళ్లు చెడిపోతుంది. అన్నిటికీ సాధనాలున్నై, చక్కగా!...

ఈ నాగరకయుగంలో పుట్టినందుకు సీత చాలా సంతోషించేది. ఎన్ని అలంకరణ సాధనాలు! ఎన్ని రకాల ఫాషనులు! ఎన్ని సదుపాయాలు! డబ్బే ఉండాలి గాని—అదృష్టవశాత్తూ డబ్బు కేమీ కొదవ లేదు; దేవుడిచ్చింది—అంటే, సీత తండ్రి ప్లీడర్ చేసి కష్టించి ఆర్జించినది—బోలెడుంది!...ఎవరయినా ముసలాళ్లు, "ఎన్ని రకాల నగలే! ఎన్ని రకాల చీరలే—తుమ్మెద రెక్కలల్లే! మా కాలంలో ఇవేమీ ఎరగం కద!" అని అన్నప్పుడల్లా, భగవంతుడు తనను 1928 లో పుట్టించినందుకు సీతమ్మతల్లి ఎంతో అబ్బరపడేది.

కాని ఏం లాభం? పాపం, సంవత్సరం నుంచీ సీతమ్మ కొచ్చే సంబంధాలు నిరుత్సాహజనకంగా ఉంటూవచ్చినై. డబ్బున్న కుర్రాళ్లు బాగా లేరు; బాగా ఉన్న కుర్రాళ్లకు చదువు లేదు; అన్నిటిలోనూ ఫస్టుగా పాసయిన కుర్రాళ్లకి డబ్బు లేదు. ఒక కుర్రాడొచ్చి గంట సేపు తన ముందు సినిమాస్టారు పోజులన్నీ పెట్టి ఇంగ్లీషు తప్ప తెలుగే మాట్లాడ లేదు. మరొక్కడు ఎంతో వినయ విధేయతలతో వచ్చి, "టాల్‌స్టాయి పుస్తకాలు చదివావా? గాంధీ ఆత్మకథ చదివావా? జాన్ స్టూవర్ట్ మిల్ గ్రంథాలు చదివావా?" అని అడిగాడు. మరో కుర్రాడు—చూడటానికి బాగున్నాడు కూడానూ, ఖర్మ!—ఆడవాళ్లకు చదువుండరాదనీ, స్వేచ్ఛ ఉండరాదనీ, వాళ్ల కిప్పుడున్న సంస్కారం పదింతలైనా పెరిగితే తప్ప అటువంటి విషయాలు గురించి ఆలోచించటంలో అర్థంలేదనీ, ఏమేమిటో చెప్పిపోయినాడు.

ఈ రకాలను ఒక్కొక్కరినే చూస్తున్న కొద్దీ సీతకు గుండె జారిపోసాగింది. తన కలలన్నీ కల్లలై పోవలిసిందేనా? ఈ ప్రపంచంలో తన మాదిరి అభిప్రాయాలున్న మగపురుగే లేడా అనిపించింది. చూడగా చూడగా లేనట్లే కనిపించింది.

ఇప్పుడు కొత్తగా సీత తండ్రి మరో సంబంధం తీసుకొచ్చాడు. సీత అభిప్రాయం తీసుకోకుండానే—సీత కొక అభిప్రాయం ఉండొచ్చుననైనా భావించకుండానే—నలుగురూ సంబంధం బాగుందంటే బాగుందనుకున్నారు. ఇంటి కొచ్చిన ప్రతి వాడూ దివ్యమైన సంబంధం అనటమే! ఏమిటిటా? వాళ్లకి మూరెకరాల పొలం ఉందిట, కుర్రాడు బాగుంటాడుట, ఒకడే కొడుకుట. రైలు స్టేషనుకు ఆమడ

దూరంలో ఉన్న ఆ దిక్కుమాలిన పల్లెటూళ్లో వాళ్లకో మేడ ఉందిట, ఒక డొక్కు కారుకూడా ఉందిట, పిల్ల వాడు ఇంటరు చదువుతూ, ఆరోగ్యం చెడి చదువు చాలించాడుట ; ఇక చదవడుట! కుర్రవాడు తల్లిదండ్రుల్ని విడిచి బస్తీలో గాని, పట్నంలోగాని కాపరం పెట్టడుట. పిల్ల వాణ్ణి సీత చూసింది. బాగానే ఉన్నాడు, ఏం లాభం? అతను వేసుకున్న గుడ్డలూ, ఆ పల్లెటూరి చాకలి చేసిన చలువా చూస్తే సీతమ్మ గుండె జారిపోయింది. (సీత గుండె చాలా సున్నిత ప్రదేశంలో ఏర్పాటు చేయబడింది.)

సీతమ్మతల్లి ససేమిరా అనటం చూసి తల్లి దండ్రులా సంబంధం వొదులుకున్నారు. కాని మంచి సంబంధం పోయిందని అందరూ గునిశారు. పరాయివాళ్లు కూడా ముక్కుమీద వేలేసుకుని, సీత కేసి వింతగా చూశారు— పచ్చ చీరమీద ఎర్ర జాకెట్టు వేసుకుంటే చూసినట్లుగా.

అయితే ఏం? తాను ఆ సంబంధం తప్పెయ్యటం ఎంతో తెలివయిన పని అని ఒక్క నెలలోపుగా రుజువయింది. ఎవ్వరూ అనుకోకుండా, తలవని తలపుగా, దేవుడు పంపించి నట్టు ఒకనాటి ఉదయం సీత తండ్రితో ఏదో మాట్లాడు తుండగా ఒక కుర్రాడు లోపలికి నవ్వుకుంటూ వచ్చాడు. చాలా సన్నగా, చాలా పొడుగ్గా, నాజూగ్గా ఉన్నాడు. సన్నని చురుకైన మొహమూ, ముక్కు, పెద్ద కళ్లూ, విశాలమైన నుదురూనూ. పాతికేళ్లుండొచ్చు, చాలా ఖరీదైన పామ్‌బీచ్ సూట్ వేసుకున్నాడు. ఈవెనింగ్ హేట్ తీసి చేతులో పట్టుకుంటే జుట్టు నిగనిగలాడు తున్నది. కాలి బూట్ జుట్టుతో పోటీ చేస్తున్నది.

అతన్ని చూస్తూనే సీతమ్మతల్లి, "వీడే నా మొగుడు" అనుకుంది. మరుక్షణంలోనే తేలిపోయింది, అతనూ ఆ పని మీదే వచ్చాడని.

సీత తండ్రి కూచోపెట్టి అతన్ని అనేక ప్రశ్నలు వేశాడు. అతను కలకత్తాలో ఉద్యోగం చేస్తూ మద్రాసుకు బదిలీ అయినాడు. రెండు వందలయాభై జీతం. కాకినాడలో ఒక ఇల్లుంది, అయిదారు వేలు చేస్తుంది. అక్కడికి పది మైళ్ల దూరంలో అతనికి పన్నెండెకరాల ఆస్తి ఉంది. తల్లిదండ్రులు లేరు. అన్నదమ్ము లెవరూ లేరు. ఒక చెల్లెలు పట్నమే ఇచ్చారు. ఇవాళో రేపోవచ్చి పిల్లను చూస్తుంది.

తండ్రి సీత సమ్మతి వేరే అడగ నవసరం లేకపోయింది. జాతకాలూ అవీ చూసుకున్నారు. కృష్ణారావు బావగారే స్వయంగావచ్చి ముహూర్తమూ అదీ నిశ్చయించు కున్నాడు. పట్నంలోనే పెళ్లి వైభవంగా జరిగింది.

పెళ్లి అయిన మర్నాడే సీత భర్తతో సినిమాకు వెళ్ల టానికి ప్రయాణమయింది. కాని అతను బీచికి వెళదా మన్నాడు. సీత సీతాకోక చిలకలాగా ముస్తాబయింది. కాలి నడకనే ఇద్దరూ శాంతోమ్ బీచికి ప్రయాణమైనారు. దారి పొడుగూతా అందరి కళ్లు తనమీదే ఉన్నాయను కున్నది సీత కాని అతను మాత్రం తనకేసి చూసిన పాపాన పోయి నట్లు లేదు. తన అలంకరణం గురించి ఏదన్నా అంటాడను కున్నది.

ఇసుకలో కూచుండా మన్నాడు కృష్ణారావు. చేతి రుమాలు అతనివ్వక పోవటం చూసి సీతే అడిగింది.

"ఫరవాలేదు కూర్చో!" అన్నాడతను. "నేనదే చూస్తున్నాను. మనకు నిజమైన ప్రతిబంధకాలు ఈ ఖరీదైన చీరలూ, ఈ దిక్కుమాలిన నాగరికతానూ. నాకీ జీవితంతో విసిగెత్తిపోయింది. ఈ ఉద్యోగం మానేస్తాను. మా పల్లె టూరు వెళ్లి పొలం చేసుకుంటూ హాయిగా కాలంగడు పుదాం. నేను కవిత్వం రాస్తాను. నువ్వు పొలం పికుకుదువు గాని!" అన్నాడు కృష్ణారావు.

"చాల్లెండి!" అన్నది సీత.

అతను సీతకేసి ఆశ్చర్యంగా చూసి, "ఎగతాళిగాదు. వారం రోజుల క్రితమే ఉద్యోగానికి రాజీనామా పెట్టే శాను... నిజానికి చూడు, ఈ ట్రాములగోల మధ్య, ఈ బస్సుల అడావుడిలో, ఈ పట్నవాసపు ఉక్కిరి బిక్కిరిలో మనం జీవించటమనేదే మరిచి పోతున్నాం. నేను హాయిగా చొక్కా విప్పేసి ఆరుబయట తిరిగి ఎన్నేళ్లయిందో! ఈ పట్నంలో ఆరుబయటేదీ? మనంగాలంటే ఏమిటో ఎరుగుదుమా? వొంటికి తగిన పనీ, తిండికి తగ్గ ఆకలీ, శరీ రానికి తగ్గ విశ్రాంతీ లేక మన కానందమంటే ఏమిటో

కూడా తెలీకుండా పోయింది. ఈ మనుషులు చూడు సాయంకాలం కాగానే ఎవరో తరిమినట్టు ఈ వీధికొచ్చి కూచుని మళ్లీ కాళ్లీడ్చుకుంటూ ఇంటికి పోతారు. గంట కొట్టగానే లేస్తారు. గంట కొట్టగానే భోంచేస్తారు. గంట కొట్టే లోపల ఆఫీసులో ఉంటారు. సాయంకాలం ఆరు గంటలకల్లా సినిమా చూసే అభిలాష తెచ్చుకుంటారు. ఫలాని ఆదివారంనాడు నాలుగున్నరకు అరియకుడి రామానుజయ్యంగారి పాటమీద మనస్సు పోనిచ్చుకుంటారు. వీళ్లలో ఎంత మంది కవిత్వం చదివారో కనుక్కో! వీళ్ల ఎదట సౌందర్యం తాండవించినా గుర్తించ లేరు. టిస్యూ చీరలూ, ఫేసుపౌడరూ మించిన అందం వీళ్లకి కనిపించదు. ఆ అందం దురదృష్ట వశాత్తూ ఆనంద మిచ్చేది కాదు—బాధిస్తుంది!..."

కృష్ణారావు ఏమేమిటో చెప్పుతూ పోతున్నాడు. సీతకి మాట లేమీ వినిపించటం లేదు. సీతమ్మతల్లి గుండె ఈసారి ఎంత జారిందంటే ఆమె కళ్లు నీటితో నిండి ఏమీ కనిపించటం లేదు. ఆమె చెవులలో ఏదో హోరు పుట్టి ఇంకేమీ వినిపించటంలేదు...పాపం సీతమ్మ తల్లి!—



"ఆంధ్ర రాష్ట్రీ దినోత్సవమువంటి ఉత్సాహ సమయంలో, ఇటువంటి సంరంభ సమయంలో "మనది" అని అనుకునే నెలవు ఒకటి మనకు లేకపోయినదే అనేచింత కలుగుతోంది. ఇచ్చటి ఆంధ్రులంతా మంచివాళ్లే. గొప్పవాళ్లే. అయితే, మన ఆడవాళ్లు మనకన్న గొప్పవాళ్లలావున్నారు. మైలాపూరులో ఆంధ్ర మహిళా సభవారు ఒక భవనము కట్టుకున్నారంటే, ఆంధ్ర స్త్రీలయొక్క పట్టుదల ఏ రూపము దాల్చిందో మీరు చూడగలిగారు."

—తెన్నేటి విశ్వనాథం.



# గ్రంథసమీక్ష

"బోస్ జియా ఉద్దీనుగా నున్నప్పుడు."

ప్రముఖ భారతనాయకుడు, కాంగ్రెస్ మాజీ అద్యక్షుడునైన సుభాష్ చంద్రబోస్, ఉన్నట్లుండి, హఠాత్తుగా మాయమైనప్పటినుండి ప్రజలు పుట్టించిన ఊహాగానాలు ఎన్నోవిన్నాం.

సుభాష్ చంద్రబోస్ ఇంగ్లీషు ప్రభుత్వం కళ్లల్లో దుమ్ముగొట్టి, అఫ్గనిస్థాన్ ద్వారా బెర్లిన్‌కు తప్పించుకుపోయిన విధానంయొక్క యదార్థగాథను, ఆయనకు కాబూల్లో తనయింట ఆశ్రయమిచ్చి అతిధైర్య సాహసాలతో అపూర్వంగా అవతలకు దాటించడానికి తోడ్పడ్డ ఉత్తమచంద్ నోటిద్వారా వింటూవుంటే ఎలాగుంటుందో అనుభవించాలంటే యీ పుస్తకం చదివి తీరవలసిందే. గ్రంథాంతంవరకు అదొక డిటెక్టివ్ నవల చదువుతున్నట్లేవుంది! 'ఆంధ్ర ప్రభ' వారి ఆంధ్రానువాదంకూడ చాల బాగుంది. నేతాజీ, ఉత్తమచంద్రుల చిత్రాలుకూడా ఉన్నాయి.

Facts are stranger than fiction !

పుస్తకం వెల రూ. 1-8-0.

మద్రాసు,కల్చరల్ బుక్సు లిమిటెడ్,పెరంబూర్.
వారియొద్ద దొరుకుతుంది.

—కె. సు.



Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the Hindi Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.

# భాష్పాంజలి

భీష్మాచార్యుడు, పండిత మదనమోహన మాలవ్యాజీ ఈ నెల 12 వ తేదీ సాయంకాలం దివంగతులైనారు.

మాలవ్యాజీ అస్తమయంతో భారతదేశానికి తీరని కొరత ఏర్పడ్డది.



1911 వ సంవత్సరంలో అలహాబాద్ హైకోర్టులో ప్రముఖన్యాయవాదిగా వేనవేలు ఆర్జిస్తున్న సమయంలో ఆ వృత్తికి ఉద్యాపన చెప్పి రాజకీయ రంగంలో దుమికిన మహావ్యక్తి.

మాలవ్యాజీ ఒక్క రాజకీయ రంగంలోనేగాక ఇతర రంగాలలో అనేక విజయాలు సాధించాడు.

మూడుసార్లు కాంగ్రెస్ మహాసభ కధ్యక్షత వహించి జాతీయ పోరాటానికి నాయకత్వం వహించాడు. 14 వేల ఎకరాల భూఖండంలో నిర్మించిన కాశీహిందూ విశ్వ విద్యాలయం ఆ విజయచిన్నాలలో ఒకటి. కాశీ హిందూ విశ్వ విద్యాలయం ప్రాచీనాధునిక సంస్కృతులను మేళవించిన సుప్రసిద్ధ విద్యాకేంద్రం. విజ్ఞానంతోబాటు జాతీయతను ప్రబోధించి విద్యార్థులను గుమస్తాలుగాకాక విప్లవకారులుగా తీర్చి దిద్దే శిక్షణాలయం మాలవ్యాజీ విశ్వ విద్యాలయం.

విద్యార్థులు తమ కేది కావలసివచ్చినా, స్వయంగా మాలవ్యాజీ దగ్గరకు వెళ్లి తమ కష్టనిష్ఠురాలను వెలిబుచ్చుకునేవారు. ఒకసారి, రాజకీయాందోళనల వల్ల తమ చదువు సరిగా సాగలేదని, పరీక్షలు మరొక మాసంరోజులు వాయిదా వేయించమని కొందరు విద్యార్థులు పండిట్‌జీని కోరారు. వెంటనే వెళ్లింది రిజిష్ట్రారుకు హుకూమ్.

ఆ రోజుల్లో కాశీలో చెలరేగిన మత కలహాల వల్ల శివరాత్రినాడు విద్యార్థులు విశ్వనాధాలయానికి పోవుటకు వీలు లేకపోయింది. ఈ విషయం మాలవ్యాజీకి విన్నవించారు. విశ్వేశ్వరాలయంలో ఉండే శివలింగాలలో ఒకటి విశ్వ విద్యాలయంలో వెలిసింది మరికొంత సేపటికి. విద్యార్థుల కొరకు విశ్వ విద్యాలయంలో 20 లక్షల వ్యయంతో ఒక అద్వితీయమైన దేవాలయం నిర్మించాలని అనాడే నిశ్చయించుకున్నాడు మాలవ్యాజీ.

ఆ మహనీయుని అస్తమయమునకు భారతావని అశ్రుధారలు సమర్పిస్తోంది.

